సర్వస్వామ్యములు

గ్రంథకర్తవి

మొదటి ప్రచురణ

1000 ప్రతులు

రాజమహేంద్రవరమున శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావు గారి
సరస్వతీ పవర్ ప్రెస్సునందు ముద్రింపబడినది. 7463 – 1953

# పీఠిక

ఇది కొన్ని పాత వ్యాసముల సంపుటి. మొదటి వ్యాసము ఉపోద్ఘాతము. కనుక ఈపుస్తకమున పీఠికయే యివ్వబడెను. విజ్ఞానమునకు, అనుభవమునకు సంబంధించిన విషయములే యిందు పొందుపరుపబడెను. ఇవి వ్రాసిన తరువాత మరికొన్ని వ్యాసములు స్ఫురించెను. అవి యింకొక సంపుటిలో ప్రచురింపబడును. ఇవి వ్రాసిన తరువాత దేశములో కొన్ని మార్పులు జరిగెను. ఇందలి విషయములు, వ్యాసములు యీమార్పులకు పూర్వము సంఘటిల్లినవని చదువరులు గ్రహింతురుగాక.

ముదిగంటి జగ్గన్నశాస్త్రి

# ఉద్యోగము



క॥ విను పురుషుడు గావింపని
పనులకు దైవ మది యెట్లు ఫల మొనరించున్
జనములు గార్యము నడపగ
ననుకూలత నిచ్చుగాక యన్యో ఫలముల్ ॥

పురుషుడు పనియే చేయునపు డేదైవము ఫలముల నీయ గలదు? మానవులు కార్యములు నడపగ ననుకూల ఫలములు ప్రాప్తించుచుండును. అని భీష్మపితామహుడు ధర్మజునకు బోధించెను. ఇదియే కర్మరహస్యమని వేరుగ చెప్పనక్కరలేదు.

'ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః' లక్ష్మి నిరంతరోద్యోగము చేయుపురుషుని వరించును. పార్వతీదేవి యడిగిన ప్రశ్నకు శివుడిట్లు బదులుపలికెను.

దైవమోపి కర్మమును చేయుటలేదు
నరుచేష్టయోగమున సిద్ధిబొందు
ఉద్యోగరహితు డెత్తెరంగున దైవసమృద్ధిబడయు

"వ్యవసాయోస్మి జయోస్మి" నేనువ్యవసాయమును అనగా కృషిని. (ప్రయత్నమును) ఎచ్చట కృషియుండునో యచ్చట

విజయముందును, కృషియే విజయము" అని శ్రీకృష్ణు డర్జునున కుపదేశించెను.

కనుక ప్రయత్నము, ఉద్యోగము, కృషి, కర్మ, పౌరుషము పరిశ్రమ, వ్యవసాయము — ఇవియన్నియు సమానార్థకములు. ఇవియేకాదు. 'దైవము' అనునదికూడ దీనితో సమానార్థకమే యని చెప్పబడెను. "పౌరుషం నృషు" నరులలోనేను పౌరుషమును. అని గీత చాటుచున్నది. దీనిభావమేమి. పౌరుషము లేనిచోట తానుండడని శ్రీకృష్ణుని నిశ్చితాభిప్రాయము. నరుని విడిచి నారాయణుడు నారాయణుని విడిచి నరుడు నుండజాల రని దైవపౌరుషము లవినాభావములని దీని తాత్పర్యము.

శ్లో. యేదైవ నిక్రృష్టాః కృత్యాదా కు వికల్పపరాయణాః
తేషాం మన్దామతి స్త్రాత నానుగమ్యా వినాశినీ॥

"ఏపనిని ప్రారంభింపక దైవ మనుకూలముగ నున్న దా నంతటదియే పని జరుగునని చేతులు ముడుచుకొని కూర్చుండు వారు విపరీతభావు లగుచున్నారు. రామా! వారిమతి మంద మతి; వినాశకరమైనది. నీవు దాని ననుసరింపకుము." అని వశిష్ఠుడు రామున కుపదేశించెను.

శ్లో॥ నతదస్తి పృథివ్యాంవా దివి దేవేషువా క్వచిత్
పౌరుషేణ ప్రయత్నేన యన్నాప్నోతి గుణాన్వితః॥

గుణవంతుడు పౌరుషముచేత సాధింపజాలని వస్తువేదియు భూమిమీదగాని స్వర్గమునగాని దేవతలందుగాని కానరాదు.

ప్రయత్నమే సాధింపనినాడు మరేదియు సాధింపజాలదు. యత్నమే మానవుడు. ప్రయత్నహీనున కిహపరములు రెండును కలుగజాలవు.

కొండికొలదియు రొట్టె యను సామెత ప్రకారము ఉద్యోగము కొలది సిద్ధి సంభవించును. అవయవాభివృద్ధి బుద్ధివికాసము ధనధాన్యములు పాడిపంటలు చదువుసంధ్యలు మానవాభివృద్ధి ప్రయత్నముకొలది సిద్ధించును. కాలుసేతులు కదపక యేప్రయత్నము చేయక తూష్ణీంభావము వహించు స్తబ్ధులు "అలసులు మందబుద్ధు లల్పతరాయువు లుగ్రరోగ సంకలితులు" అని భారతము ఘోషించెను.

'గొప్ప కుటుంబీకులు' అనుకొని మురిసినవారి మనుగడ పరీక్షింపబడెను. 'మనము గొప్పవాళ్లము ధనము కలవారము శ్రమపడుట తక్కువవారికర్మము. సుఖించుట భోగించుట మనవంతు. బ్రతికినన్నాళ్లు కడుపులో నీళ్లు కదలకుండ నీడపట్టున సుఖముగ ననుభవింపక శీతవాతాతప బాధల ననుభవింపనేల? దాసదాసీజనులుండ మనము కష్టపడనేల? సుఖించుటయే మన పరమావధి' అను సూత్రములతో నీకుటుంబము నడుపబడెను.

ఇట్టికుటుంబములో నపురూపముగ నల్లారుగ పెరిగిన పిల్లవాడు శాండుఫర్డుమెర్టను కథలోని పిల్లవానివలె బొద్దుగనుండగ పెరిగి చిన్నతనముననే పెద్దరోగముల పాలై వీధిబడిలోనే చదువుచాలించి గట్టిగా రెండుమైళ్ళునడువజాలని హీనపుముద్దయై రోజుకొనుచు జీవించుచు ముక్కుద్దముల

తోను ముఱిపములులేని బ్రతుకుతోను ముప్పదియేండ్లు నిండక మునుపే జలోదరాది వ్యాధులచేబాధపడి బ్రతికి నన్నాళ్ళు కుటుంబమునకు బరువై చనిపోయెను. ఇట్టి యప్పురూపపు గారాబముచేతను అలసజీవితము నలవరచుటచేతను తమబిడ్డలకు చేజేతుల నపకారముచేయు తల్లిదండ్రు లెందరోకలరు.

మానవుడు అతని ప్రతియవయవము పనిచేయుటకు శ్రమించుటకు తమతమ ధర్మములను నెరవేర్చుటకు అట్లునెరవేర్చుట ద్వారముననే వృద్ధిజెందుటకు నుద్దేశింపబడినవే గాని వానిని యథాతథముగనుంచి యేయుపయోగమును చేయక నోకమూల పారవేయుట కేర్పడలేదు. అట్లు చేయుటవలన శరీరము యావ జ్జీవితము కూడ నష్టము భ్రష్టము నగును.

కృషిలేనిదే జీవితమే లేదని ప్రకృతి వేనోళ్ళ చాటుచున్నది. తేనెటీగలను పెంచువాడొకడు తన ఈగలు మైళ్ళకొలది దూరము ఎగిరి పువ్వుపువ్వున గల మకరందము గ్రోలి తన యింటికి మోసికొనివచ్చుట జూచి యవి యంతకష్టపడుట కిచ్చగింపక వాటి రెక్కలను కోసివేసి తానే పువ్వులను కోసికొని వచ్చి తేనెటీగలు నివసించు పెట్టెలలో భద్రముగ పెట్టుచుండెడి వాడట. కాని యత డట్లెంతకాలము చేసినను యాతేనెటీగ లావంత తేనెయు చేకూర్చ నేరవయ్యెను. అవి స్వేచ్ఛగ నలుదెసలకు పరుగులిడి పువ్వుపువ్వున వ్రాలి మకరందము గ్రోలి మధుభరితములై తమతమ నెలవులకు తిరిగివచ్చి యథేచ్ఛగ మధురవర్షము కురిపించ వలయునేగాని మన వర్తి బ్రతుకు బ్రతు

కుటవలన నవితేనెను కూర్చజాలవు. మధుకరజాతి మానవ జాతి కెంతచక్కటి గుణపాఠము నేర్పుచున్నది.

కనుక నుద్యోగింపని వాని బ్రతుకు నిరర్థకము. మనదేశ ములో నేడు ఉద్యోగ శబ్దమునకు దౌర్భాగ్యమైన యర్థము కల్పింపబడినది. నేడు ప్రభుత్వసేవయే 'యుద్యోగము! ప్రభుత్వ సేవకుడే యుద్యోగస్తుడు! తక్కినవారు నిరర్థకులు వారిజన్మ వ్యర్థము 'మాఅబ్బాయి' 'యుద్యోగము' చేయుచున్నాడు లెండి' అని యేచెన్నపట్నములోనో నూరురూకలను తెచ్చు కొనువాని తల్లిదండ్రులు సగర్వముగ పలుకుచుందురు. ముంజేతి బంగరు ఘంటలను అవధరించి తమ ప్రౌఢభాషను కురిపించు శతావధాన కవులలోనొకరు పరప్రభుత్వ సేవను ఆ దేశపూర్వ కముగ నిరాకరించిన మిత్రుని "అయ్యో మీజీవితము వ్యర్థము చేసికొందురా మీబుద్ధి మీచదువు 'ఉద్యోగము' కొరకు అనగా నౌకరీకొరకే కాదాయని విలపించుచు నోదార్ప జూచెను. పరిస్థితులు భావములు మారుట తోడనే పదముల అర్థముకూడ మారిపోవును. బానిసత్వమునే వరించిన మనకు నౌకరీపనియే 'యుద్యోగము' గొప్పతనము నాగరికత మగ తనము నైనది.

ఇచ్ఛకములాడి యబద్ధములు చెప్పి ఏ యెండకా గొడుగు పట్టి మాటిమాటికి రంగుపిరాయించి రావణాస్వస్తి రాఘవా స్వస్తి యనుదొంగ స్వస్తివాక్యములను చదువుచు నాలుగు

రాళ్లు వెనువేసికొనువాడే యధికుడు. ఉద్యోగి గౌరవార్హుడు సభాపూజ్యుడు.

జగద్గురువుగ దివ్యజ్ఞాన సమాజమువారిచే పరిగణింపబడిన జిడ్డుకృష్ణమూర్తిగారు రాజమహేంద్రవరములో నొక గొప్ప సభలో నుపన్యసించుచు 'నెలకు పదివేలజీతము తీసికొను పెద్ద 'యుద్యోగి' మొదలు పదిహేను రూపాయిలనౌకరు వరకు నందరు నౌకరులేయని దాస్యము దాస్యమేయని యందులో స్వాతంత్రత స్వేచ్ఛ యుద్యోగము స్వప్రయత్నము సృజనశక్తి యుండనేరవని 1929 ప్రాంతములో వక్కాణించిన నప్పుడు ఆసభలోనున్న యధికార బృందమంతయు కళవళపడెను. ఇం దసత్య మేమియులేదు.

"నేను చదివిన చదువంతయు నుద్యోగము కొరకు ఉద్యోగము పించనుకొరకు నా యీ పించను పోయినచో జీవితము పోయినట్లే" అని వీరుల జీవితములను స్వాతంత్రభావములను జాతి నుద్దీపింపజేయు తెనుగు గ్రంథములను చూచుటకు తాకుటకు నులిక్కిపడి బిక్కమొగము వేసిన పెద్దయుద్యోగస్థుని యుద్యోగమును ఏమనివర్ణింపగలను?

జీవితమును కేవలము అణాలతోను పైసలతోను తూచుట న్యాయమా? కాదు. అదియొక అపూర్వావకాశము. అపూర్వ ప్రసాదము. మానవత్వమును పోనాడి ధనమును కొల్లలుగ నంపాదించవచ్చును. కాని మానవజీవిత మంత తేలికగ లభ

మగు వస్తువుకాదే. పోయినధనము నార్జించు కొనవచ్చును. కాని గడచిన దినము తిరిగిరాదుకదా!

మానవసంపద యనుదాని కర్థమే యీ రోజులలో వ్యత్యస్తమై నీచార్థమే ప్రచారములో నున్నది. ఎకరములు గాదులు సౌధములు కారులు బ్యాంకునోటులు మానవపరమావధి చివరకు అదియే మానవజీవితముగ మారిపోయినది. మన నిజసంపద యగు భావసౌందర్యము స్వతంత్రయత్నము న్యాయము ధర్మము పరోపకారము జీవితోల్లాసము, బుద్ధిబల ఉత్సాహబల సమృద్ధి అవ్యాజమగు మేలుసేత కృతఘ్నతవాటింపమి జ్ఞానసముపార్జన మసలను మన మాతాపితృదేవతలను పోషించిన దేశమును సేవించుట చతుర్విధ పురుషార్థములను అనగా ధర్మ, అర్థ, కామ, మోక్షములను సాధించు యత్నమే నిజమైన యుద్యోగము—అని పెద్దలుసిర్వచించిరి. ఈ మానవ సంపద యీ జీవిత సంపద వెండి బంగారములకంటె పొన్న కర్రలకంటె వందిమాగధుల స్తోత్రములకంటె గొప్పది.

డబ్బు చెలామణి తాత్కాలిక వ్యాపారము. జేబులు కాళీ యగుట తోడనే మనిషి తేలిక యగుచున్నాడు. ఆర్థికసంపద యెంత వాంఛనీయమైనను అంతకంటె గుణసంపద గణనాతీతమైనది. అది మానవుని యెన్నడును వీడకపోగా యతనిని సదా సేవించుచుండును. రాణాప్రతాపసింహుడు, పృథ్వీరాజు, శివాజీ, లక్ష్మీబాయి, రుద్రమ మల్లమాదిమానధనులను లక్ష్మి

వరించి విడిచిపెట్టినను వారి మానధనము ఆచంద్రార్కము నిలచియే యుండును.

కృషియే మానవోన్నతి యని ప్రయత్నము, పౌరుషము మానవధనమని గుణము మానవుని నిజసంపద యని మహాత్ముల జీవితములు చాటుచున్నవి. గాంధీజీ తన మహాదాశయము చేతను అవిరళ కార్యకలాపము చేతను దీనినే ప్రదర్శించుచున్నాడు. ప్రకృతియంతయు నీసత్యమునే చాటుచున్నది. అణువు మొదలు బ్రహ్మాండము వరకు చీమ మొదలు సమస్త జంతుజాలము క్షణము క్షణియింపకుండ నిరంతర పరిశ్రమ చేయుచు వృద్ధిజెందుచున్నవి. పరిశ్రమయే వృద్ధి పరిశ్రమింపక పోవుటే నాశము.

గ్రహ తారకములు కూడ నిరంతరము పరిశ్రమించుచునే యున్నవి. ఏగ్రహము పనిచేయక పోయినను యీజగము జగమే కాదు. అప్పుడంతయు నంధకారమే యగును. గచ్ఛతి యనగా నడచునది కనుకనే యిది జగమనబడుచున్నది. నడవజాలనిది జగమేకాదు.

ఇక మనముచేయు కృషి యెల్లపుడు మనస్ఫూర్తిగ నుల్లాసయుతముగ లీలాసమన్వితముగ నుండవలెను. "మనము హృదయపూర్వకముగ చేయజాలని యేకర్మకొరకు సృష్టింపబడలేదు." అని రస్కిన్ మహాశయుడు వచించినాడు. హృదయపూర్వకముగ చేయని శుష్కకర్మలో రసముండనేరదు. రసము

లేనిచోట ఆనందముండదు. ఆనందముతో చేయనికర్మ ఫలవంతము శక్తివంతము కాజాలదు. కృషి చేయుటలోనే యానందమున్నది. హేయమైనదని కష్టమైనదని మనమొకపనిని నిరసనగచూడవచ్చును. కాని దానినేమనము నడుముబిగించి ప్రారంభింతుమేని మన మనస్సులలో నొక వింత యానందము ఉల్లాసము కలుగుచుండును. ప్రారంభింపక పూర్వమున్న సంశయములు నైరాశ్యము విచారము మొదలగు దోషశృగాలములు తమతమ బొరియలలోనికి పారిపోవును. కష్టమనుకొనిన పని తేలికయగును. కృషిచేసినకొలది నీవు వృద్ధిచెందుదువు "కృషితో నాస్తి దుర్భిక్షం" కృషి యున్నచోట దుర్భిక్షముండనేరదు.

దీనినే మహాత్ముఁ డెలుగెత్తి చాటుచు నలువదికోట్ల భారతీయులు నదీనదములు సమస్త ఖనిజ సంపద యితర ప్రకృతి సంపదగల మన మితరులను దేవురించి బ్రతుకనక్కఱ లేదని నిష్కర్షగా చెప్పినను నడమంత్రపు ఆర్థికపదజాల వ్యామోహితులకీ వాక్యములు చెవిటివానిముందు శంఖూదినట్లున్నది.

ఆధునికులలో గొప్ప ఆర్థికవేత్త యగు జాన్‌స్టూవర్టుమిల్లు చెప్పినవాక్యములు గమనార్హములు. "ప్రపంచములో ననేకమతములు, జాతులు, భాషలు, ఆచారములు, సాంప్రదాయములు, నీతులు కలవు. కాని యీమతములు భాషలు యిత్యాదులతో సంబంధములేక స్వతంత్రముగను, సనాతనముగను నిలిచివచ్చుచు

జీవితమునకు సబంధించినది, ప్రాణికోటి నంతను మేళవింప చేయునది, సరళమైనది యగు ప్రచండ శాసనమొక్కటే కలదు. నీ సామర్థ్యములను బాహ్యపరిస్థితులను చక్కగ విలోకించి నీవు పొందగలిగిన యత్యున్నతసిద్ధి పొందువరకు నవిరళ యుద్యోగము చేయుటొక్కటే శరణ్యము.

కృషి చేయుట సః ప్రకృతి ధర్మము. కృషికి కృషియే ఫలితము. తక్కిన ఫలితములు వాటంతటవియే ప్రాప్తించును. కనుక నీవు యెన్నడూ కృషినివీడరాదు. అట్లునీవువిడుచుటకును సాధ్యము కాదని యది దురాగ్రహ మగునేకాని సత్యభావ కాజాలదని దానివలన నీ శరీరయాత్రకూడ సుఖముగ జరుగజాలదని భగవద్గీతాచార్యుడు నిష్కర్షగ వచించినాడు. ప్రఖ్యాతకవి యగు ఎమర్సను "ముందు పనిజేసి తరువాత మాట్లాడుము. దాని ఫలితమును నీవెన్నడు తప్పించుకొన జాలవు. నీపనులలో నాలస్య మెన్నటికిని పనికిరాదు. "ఆలస్య మమృతం విషం" ఆలసించినచో నమృతముకూడ విషమేయగును. చావు బ్రతుకుల మధ్యనంతరు వెంతకలదో నీ వెరుగవా? ఒక్కక్షణము. క్షణము పూర్వము జీవించుచున్నాడు. మరు క్షణములో చనిపోవుచున్నాడు.

మూడు చేపల కథ మనమందర మెరిగినదే. దీర్ఘదర్శి ప్రాప్తకాలజ్ఞుడు దీర్ఘసూత్రుడు అను మూడు చేప లొక మడుగులో నివసించుచుండెడివి. వేసవిప్రభావముచేత నామడుగు యింకిపోవ

నారంభించెను. ముందుగనే మేల్కాంచిన దీర్ఘదర్శి మరియొక ప్రవాహములోనికి సురక్షితముగ చేరుకొనెను. అతని సలహా వినక వచ్చిన తరువాతనే చూచుకొన వచ్చునని యూరకున్న ప్రాప్తకాలజ్ఞుడు ఆలోచించుచు కాలయాపన చేసిన దీర్ఘ సూత్రుడు భంగపడిరి.

ఉమాదేవికి శివుడొకసారి యిట్లుపదేశించెను.

ఎల్లి సేయు పనులు

నేడ యింతి మూహానర్చ్పని రేప చేయుట నామతంబు.

ప్రతిరాత్రి నిద్రించుటకు పూర్వము "నేడు నేనేమిచేసితిని? అది నన్నెచ్చటకు గొంపోవును?" అని నిన్ను నీవు ప్రశ్నించు కొనుము. అని యొకమహనీయుడు అభ్యాసము మార్గమును తనమిత్రులకు బోధించినాడు. మనఃపూర్వకముగ తన ధర్మ మును నెరవేర్చునట్లు తలచిన రోజున నొకఋషి యస్వస్థతచే బాధపడెడి వాడట. నీ ధర్మనిర్వహణమందే నీ శరీర మాన సిక సౌభాగ్యము సదా సంరక్షింప బడుచుండును. నీ నరములు నీనాడులు నీయవయవములు నీబుద్ధి నీగుణ గణములు నీప్రాణ దక్షత నీక్రియాకౌశలము—ఇదియది యననేల మానవుని పరి పూర్ణ స్థితికి తీసికొనిపోవు సమస్తము ధర్మనిర్వహణము ద్వారా జరుగవలెను. దీనికింకొక మార్గములేదు.

నీ సంతతికి నీవేమి దానము చేయవలెను? లక్షలా? ఎకర ములా? సౌధములా? నీ కడుపు కట్టుకొని నానా యిడుములు

పడి నీవట్లు చేతువు. మంచిదే! కానినీవు నీజీవితములో పొందినశిక్షను గడించుటలో నీకున్న చాకచక్యమును నీయోర్పును బుద్ధిపాటవమును వినయవివేకములను నీ నేర్పరితనమును అతనికి బదలీ చేయగలవా? వీనినిసాధింప నవసరములేని స్థితినే నీవతనికి కల్పించితివి. సోమరితనమునకు విషయులోలత్వకు రోగ భోగములకు కావలసిన యవకాశములను నీవే కల్పించితివి. జీవిత రంగస్థలమున పోరుసలిపి సంపాదించుకొనవలసిన యనేక సుగుణముల కవకాశములే లేకుండ జేసితివి. ధనార్జనలో నీ కానందము కలిగినది. నీ వుబ్బితివి. రెక్కలు వచ్చినట్లనుభ వించితివి. కాని యాధనమే నీకుమారుని మెడకు గుదిబండ యగుట భయకారణము చివరకు మృత్యువుకూడ నగుచున్నదే. ఇట్టి విషమ పరిణామము రాకుండ నీవు చేయగలవా?

"పరిశ్రమయే ప్రకృతి నియమించిన వైద్యుడు" అని యొక గొప్ప గ్రీకు దేశపు వైద్యుడు చాటెను. అనేక సామాన్య రోగములు నీవు కార్యనిమగ్నుడ వైనప్పుడు పలాయన మగు చుండుట నీయనుభవములో లేదా? ఇది యథార్థవాక్యము. రోగములను గురించి చింతించుటకు విలపించుటకు తగిన తావీయకుండుటే వానికి తగిన విరుగుడు. నీ వాదరించినప్పుడే రోగములు నీపై బడుచున్నవి. పనిచేయునప్పుడు డాకలిదప్పులు కూడ మరచి పోవుచుందుమే. పనిచేయనివాడు పనిచేయని వానికి ఆకలియే మిగులు చుండును. పని శరీరమును మరపించును. పనిచేయువానికి కాలముకూడ లొంగిపోవును. పనిచేయని

వాని కాలము గడవదు. "సోమరి మెదడు సైతానురంగ స్థలము" సోమరితనమును మించిన విషమున పనిని మించి, యమృతము వేరుగ లేవు.

ఎప్పుడు ప్రవహించు ఏరు నిర్మల సలిలములతో సదా ప్రవహించుచునే యుండును. చలనములేని గుంట రోగభూయిష్టమై పుచ్చిపురుగు లోడుచుండును. పనిచేయువాడు నదివలె చిరంజీవియై యుండును. "ప్రజలను యజ్ఞములతోసహా సృష్టించి వీనిద్వారా మీరు వృద్ధిపొందుడు ఇవియే మీ యిష్టములను కురిపించు కామధేనువులు" యని సృష్టినిర్మాణము జరిగినట్లు గీత స్పష్టము చేయుచున్నది. కర్మయే సృష్టిరహస్యము.

పురుషప్రయత్నముచే సాధింపబడజాలని శుభమేదియు లోకములో నీకు చేకూరజాలదు. నీయునికికి నీసమస్తమునకు నీవేవిధాతవు, నిన్ను కాదని నీగతిని నిర్ణయించువాడింకొకడు లేడనియే కర్మ సిద్ధాంతము చెప్పుచున్నది. ఈసిద్ధాంతమున కింకొక యర్థము చెప్పుట వ్యర్థవాదము. జర్మనీ దేశ విధాతలలో నొకడగు బిస్మార్కు చనిపోవుటకు ముందిట్లుపదేశించెను. "పని! పని! పనిలేని జీవితము శూన్యము నిష్ప్రయోజనము దుఃఖభాజకము. పనిచేయనివాడు సుఖము ననుభవింప జాలడు. జీవితరంగము నధిష్ఠింప నున్న యువకునకు నే నొక్కమాటలో కాదు— మూడుసారులు పని. పని. పని. యని చెప్పెదను." ఇది ప్రతివానికి నందుబాటులో నుండునది, సరళముగ చెప్పదగినది. సుఖావహమగు నదియగు జీవితశాసన మనియతడు చెప్పెను.

కార్లైల్ మహాశయుడు కర్మనుగురించి యీ విధముగ చెప్పెను.

కృషి సదాపవిత్రమైనది. ఉదారమైనది. పరిపూర్ణత కది మూలము. పనిచేయనిదే ఎవడును దేనిని సాధింపజాలడు. పూర్ణుడు కాజాలడు. పనిమానవుని నిర్వీర్యు మొనరించు దుష్ట విషసంపర్కముల నన్నిటిని నశింపజేయు పవిత్రాగ్ని. కర్మ మానవుని నలిమివేయు దుఃఖములకు, రోగములకు మహా దౌషధము. పనిలో నొకవిధమగు నిత్య పవిత్రత కలదు. గొప్పతనము కలదు. మానవుడెంత యజ్ఞాని యైనను, పామరు డైనను, నిజధర్మము మరచిన వాడైనను, శ్రద్ధ, నిజాయితీ కల్గి పనిచేయుచో ధన్యుడేయగును. సోమరితన మొక్కటే నిరాశ కేకైక కారణము.”

అవ్యాజముగచేయు పనియంతయు పవిత్రమైనదే. యథార్థ కృషియంతయు అది కేవలము శారీరకమైనను చేతిపనియైనను దానిలోనొక దివ్యత్వము కలదు. ప్రపంచమంత నైశాల్యము గల యీకర్మకు స్వర్గమే శిఖరమగుచున్నది. కర్మయే ఈశ్వ రారాధన. ఈకర్మను చక్కగగ్రహించిన వానికి భవితవ్య రహస్య మంతయు కరతలామలక మగుననుటలో ఆశ్చర్య మే మున్నది? ఇది తక్కినయన్ని దేవతలను తనలో నిముడ్చుకొనిన పరా దేవత”

“ఈలోకములో నేనిద్దరినే మాననీయులుగ పరిగణింతును. మూడవవాడు లేడు. ఇందు పనిముట్లులతోను, ఇతర పరికర

ములతోను భూమిదున్ని పండించి ప్రకృతిని జయించి దానిని మానవపరము చేయుకృషీవలుడు ప్రప్రథముడు. కష్టించుహస్త మును నేనారాధింతును. ఇంతకంటె మిన్నగ నేనారాధించు వాడు మరియొకడుగలడు. పరమార్థము కొరకాధ్యాత్మిక ముగ—అనగా శరీరమును నిలుపు అన్నముకొరకు గాక—జీవనా షధముకొరకు పాటుపడువానిని నేను భజింతును. బీదలు, సామాన్యులు, తక్కుంగలజనులు మనయన్నముకొరకు పాటు పడుచుండ ఘనులు, తేజోవంతులునగువారు తమకొరకు, మన యందరికొరకు జ్ఞానమును, స్వాతంత్ర్యమును, నమృతత్వమును భద్రమైన మార్గమును సాధించుటకు పాటుపడ నక్కరలేదా? ఈయుభయులను నేనారాధింతును. తక్కినదంతయు పొల్లుజీవి తము. సారమునెరుగని జీవితము.”

ప్రతిపనిని తన రుచికభిమతముగనుండునట్లు మార్చుకొన గలవాడే వివేకవంతుడు. ఏపనియు గర్హ్యముకాదు. ఈప్రపం చములో సమస్తము పైకి మట్టివిత్తనమువలెను, ఆసగింజవలెను కాన్పించినను తన గర్భములో నింగికెగయు వటవృక్షమును దాచియుంచుకొనును. దీనిని గ్రహించి ప్రతిపనికి గొప్పతనమును ప్రసాదింపగలవాడే వివేకవంతుడగును.” మహాత్ముని చేతిలో చమారీపని, పాకీపని, మొదలగు సమస్తపనులకు పవిత్రతయే ఘటిల్లెను. పనిలో పవిత్రతను చూడలేకపోవుట మనబుద్ధి జాడ్యముగాని నైసర్గికదోష మేపనిలోను లేదు.

---



ప్రేమలేకుండ జీవించు మూక సాహచర్యము కాజాలదు. వారి ముఖములు కేవలము బొమ్మల మంచ యగును. వారి సంభాషణ తప్పెటల చప్పుడు.

— బేకన్.

నీ నిజసంస్కారమే నిన్ను ఇతరుల దుశ్చరితలనుండి రక్షించు కవచము. వెళ్లి భగవంతుని మిత్రుడెవడో తెలిసికొనుము! నీ వట్లు చేసిననాడు భగవంతుడే నీకు మిత్రుడగును.

శిశువులు తమ్ము ప్రేమించు వారిని పసిగట్టగలరు. అది ప్రకృతి వారికి ప్రసాదించిన వరము. ఎదిగిన కొలది మనము దానిని పోగొట్టుకొను చుందుము.

కుటుంబము ప్రకృతియొక్క రచనలలో నెల్ల విశిష్టమైన యొక రచన.

స్త్రీయందు గుణములు తప్ప మరేవియు మనసుకాడ రావు.

— విట్మన్



# పొదుపు

ఊడలు వేళ్లు కొమ్మలు లెక్కింపసాధ్యముకాని యాకులు ఫలపుష్పములు కలిగి యనేకజీవరాసుల కాశ్రయమగు మఱ్ఱి వృక్ష మెక్కడ? నలుసువలె కనపడ నట్టియు దాని బీజ మెక్కడ. కనురెప్పపాటు కాల మెక్కడ కోట్లకోట్ల కనురెప్పపాటుల గుణకారమే యైన యనంతకాలవాహిని యెచ్చట? కుశాగ్రమున మెరమెరలాడు బిందువెక్కడ? అట్టి బిందువుల బింకువైన సింధువెక్కడ? చిన్న వస్తువులే పెద్దవస్తువులకు కారణమగుట పెద్దవస్తువులే యగుట సర్వత్ర కానవగుచున్నది. 'అ-దృష్ట' అనగా కనబడని 'బీజమే' దృష్టవృక్షము లగుచుంట ప్రకృతిధర్మము.

చిన్నవికదాయని మనము వేనిని నిర్లక్ష్యము చేయకూడదు. చలిచీమలే పెద్దపామును చంపివేయుటకు సమర్థములగుచున్నవి. చిరుచేపయే తిమి తిమింగలము నగుచున్నది. రేణువులే కొండ లగుచున్నవి.

'అ-దృష్టము' అనగా కన్పించనిది. అనిమనము పిల్చుదాని కర్థమేమి? అది దానంతటది యూడిపడునది యనుకొనుట ఏదైవమో పైనుండి కురిపించునది యనుకొనుట పొరపాటు. అదియదాత్తుగ అప్రయత్నముగ లభించునదియు కాదు. దాని బీజము మనకు స్పష్టముగ దృగ్గోచరము కాకపోవచ్చును. మఱ్ఱి

విత్తనమువలె నదియుండవచ్చును. "పెందలకడనే లేచువాడు చెమటూడ్చి పనిచేయువాడు యింగితజ్ఞానము కలవాడు సంపాదించిన దానిని పొదుపు చేయువాడు సరళజీవి నిర్దుష్టమైన నిజాయితీకలవాడు దురదృష్టమునుగురించి విలపించుటను నేనెన్నడును చూడలేదు. అవివేకులు కలలుగను దురదృష్టము మంచినడత, మంచియలవాటులు మొక్కవోని పరిశ్రమ కలదుర్గములను ఛేదింపజాలదు." అనిఎడిసన్ కవి వచించెను.

పొదుపే యదృష్టబీజము. పొదుపులేనిచోట నెట్టియదృష్టము పట్టదు. పట్టినను నిలువదు. 'పడుచు కాపురము చితుకుల మంట' యనునట్లుండుచో నది యెంతకాలము నిలుచును? ఒకడు వందలువేలు సంపాదించవచ్చును. అతడంత మాత్రముచే నదృష్టవంతుడగుచున్నాడా? లేదు. డాక్టరుస్నేహితుడొకడు వందలకొలది సంపాదించెడివాడు. కాని వందెమువేసిన ట్లతడు దాని నంతను ఖర్చుచేయుచు నెలతిరుగు సరికికాళీ. సంవత్సరమునకు ప్రామిసరీనోటు, మూడేండ్లకు తనఖా, చివరకొక దశలోనే యతనిదశ మారిపోయి ఋణబాధతో తల నెరసిపోవుట జరిగెను. ఒకస్నేహితుడు వర్తకము జోరుగా సాగించి వేనకువేలు గడించి మేడలు మిద్దెలు నూటులు కారులు మొదలగునవి ధనాయించి యొక్కవెలుగు వెలిగి యేబదిసంవత్సరములు నెసమందుగురు పిల్లలు కలిగిననాటికి సర్వముఅమ్ముకొని చేతపైసలేక దిగాలుపడి కూర్చుండెను. తన సంపాదనతోపాటే పొదుపుకూడ నలవర్చుకొనుచు

రోజుకు నెలకు సంవత్సరమునకు 'ఇంత' యని యెంతోకొంత మిగుల్చునలవాటే చివరి కదృష్టమగుచుండును. దీనివలన న్యాయమైన సౌఖ్యములలో తగ్గించుకొన వలసినది పోగొట్టుకొన వలసినది యంతగానుండదు. అనవసరఖర్చు దూబరా ఖర్చు తన కేయపకీర్తిని జాడ్యమును సిగ్గును తెప్పించుకొనిన చాలును.

ఆయము నెరిగి వ్యయముచేయుము: 'నీగడ్డనుబట్టి కోటు కత్తిరించుకొనుము.' అను సామెత కలదు. నీ ఆదాయములో నేకొద్దియంశమో మిగుల్చునలవాటు చేసికొనినచో నదియే పెద్దమొత్తమగుచుండును. పావలా సంపాదించువాడు ఆరు పైసలుచొప్పున మిగిల్చినచో సంవత్సరమునకు పన్నెండు రూపాయలగుచున్నది. నీసంపాదనలో పదవవంతు మిగిల్చినచో పదియేండ్లలో నది యెంతయగునో లెక్కవేసి నీకునీవే చూచుకొనుము. ఇది సహజము కాదందువా? వర్షకాలము వచ్చునని చీమలు కూడ బెట్టుకొనుటలేదా? తలదాచుకొనుటకని పక్షులు గూండ్లుకట్టుకొనుటలేదా? ప్రకృతియే బోధించుపాఠములను నీవు నేర్వనక్కరలేదా?

డబ్బుకొరకై డబ్బును కుప్పలు పెట్టకూడదు కాని యిట్టి పొదుపులో తప్పేమియు లేదు. పైగాయిది నీధర్మము. నీయెడల నీకుటుంబము నెడల నీవు నిర్వహింపవలసిన ప్రథమధర్మము. తగినవయసులో నార్జనకాలములో నిట్లుచేయక పోయినచో

'నింత బ్రతుకు బ్రతికి యింటివెనుక చచ్చె' నన్నసామెతవలె గడనపరుడై యుండియు కాలము చెల్లినతరువాత తనకొరకు తన కుటుంబముకొరకు నొరుల నాశ్రయించుటకంటె దైన్యము వేరొండులేదు. నీస్వాతంత్ర్యమును నీగౌరవమును నీయునికిని నిలబెట్టుకొనుటకే పొదుపు చాలఅవసరము. ఆర్థికముగా నెన్నడు నొరులమీద నాధారపడని వాడే ధన్యుడు; "నేనెవరికినొక్కపైసయైన నివ్వనక్కరలేదు. నేను రాజువలె చనిపోవుచున్నాను;" అనియొకడు మృతిచెందుచు చివరికి హాయిగప్రాణములువిడిచెనట

ఋణము పాపిసత్త్వము. అది మానవుని స్వాతంత్ర్యమును కళను ఉత్సాహమును గుణగణములనుకూడ హరించివేయును. కనుకనే 'చేయిచాపువానికి, అణాబిళ్ళలమీద సంతకములుచేయువానికి, గౌరవమర్యాదలు పరువుప్రతిష్ఠలు నిలువవు. అట్టివాడు నిశ్చయముగా నిర్మొహమాటముగ నిశ్చింతగా పడువజాలడు. నిద్రింపజాలడు. "ఈజీవితమునందు మనకు కష్టముగా నుండునవనేకములు కలవు. ఆకలి చలి పరితాపము కష్టించుట ద్వేషము అనుమానము అహేతు నింద మొదలగునవెన్నియో కలవు. కాని ఋణము యీయన్నిటికంటె నెన్నియోరెట్లు హేయమైనది. ఎన్నడు ఋణగ్రస్తుడవు కాకుము. నీకు వారమున కేబది రూపాయిలు మాత్రమే సమకూరునేని వానితో నీవచ్చు రసవర్గములను కొని తినుము. ఎవనికినొక మాడయైనను బాకీపడకుము" అనియొకతండ్రి తనకుమారునకు సలహాచెప్పి మరణించెనట. ఋణప్రభావమును గురించి యింతకంటె వేరుగ

చెప్ప వలయునా? నాస్నేహితుని తండ్రియొకడు ముప్పదివేలు ఋణముచేసి 'ఋణమో, ఋణమో' యని కళవళ పడుచు ప్రాణములు విడిచిపెట్టెను, 'పైసలను ఖర్చుపెట్టునపుడు నీవు జాగ్రత వహింతువేని పౌనులు వాటంతటవియే జాగ్రత్తపడును' అను సామెత కలదు.

'దారిద్ర్యము తలుపు తట్టగానే ప్రేమ గవాక్షము నుండి పలాయనమగును, కట్టుకున్న భార్యబిడ్డలుకూడ గుడ్లెఱ్ఱజేతురు. చెఱువెండగానే కప్పలు మాయమగుచున్నవి. చెట్టు యెండి పోవుట తోడనే యొక్కపిట్టయైనను నిలుచుటలేదు. పచ్చగా నున్నపుడే పదిమంది నిన్ను పలుకరింతురు. ఆపదను తప్పిన యెడల నిన్ను పలుకరించువారెవరు? దారిద్ర్యము నన్ని విధ ముల నెదుర్కొనవలసినదే. గృహస్థు ధర్మవిరుద్ధముకాని మార్గములద్వారా ధనము సంపాదించి బంధుమిత్ర అతిథి యభ్యాగతులను సంతోషపెట్టవలెనని సోమరిగా నుండరా దని వివేకానందుడు 'కర్మయోగము' అను గ్రంథములో చాటినాడు.

ధనముకొరకే ధనమెట్లు పనికిరాదో దరిద్రముకొరకే దరిద్ర మును వరింపనవసరములేదు. ఐచ్ఛికముగ సన్యాసము స్వీకరిం చినవారి సంగతివేరు. అదియొక ప్రత్యేకతరగతి. తక్కిన గృహ స్థులందరు తమగౌరవ స్వాతంత్ర్యములు నిలబెట్టుకొనుటకు నెట్టి పరిస్థితులలోను హైన్యము ననుభవించ కుండగలందులకు తమ

శక్తి కొలది యార్జించుచు పొదుపుచేసికొనుచు జీవింపవలెను. దక్షత కొన్నిసుగుణములచేత నేదియో యొకపనితనము పరిశ్రమ యేకాగ్రత కలవాడు గాని గడింపజాలడు. ఐశ్వర్యము కేవల సంపాదనలోనే గాక పొదుపు చేసికొనుటలోనే కలదు.

డబ్బే పానమని డబ్బేపరమావధియనిడబ్బుకొరకే కకుర్తి పనియైన చేయవచ్చునని డబ్బు నిలువచేయువాడే సుఖవంతుడగునని భావించుటమాత్రము పొరపాటు.

"ఎంతయున్నను చాలనివారే దరిద్రులు. ఇట్టి నిత్యదరిద్రులను మనముచూచుచునే యుందుము. వీరి 'కడుపులు ఖండవల్లి మడుగులు.' అవి నిండుటయనునది యెరుగవు. కాపలాకాయుట నోర్లుట వీరివంతు. దానియనుభవము మరియొకరివంతు. నిజమున కున్నదానితో తృప్తిపడువారు (అదికొద్దియేయైనను) దరిద్రులుకారు. ధనమేసమస్తము అని సామాన్యముగ ననుకొను మాట పొరపాటు." అనియొక జీవిత రహస్యవేత్త నుడివినాడు.

నేనొక స్నేహితుని యెరుగుదును. అతని తండ్రి లక్షలార్జించినాడు. ఆర్జించుటలో కుడియెడమ లేకుండ దౌర్భాగ్యపు పనులెన్నియో చేసినాడు. ఈకుమారుడును తత్తుల్యుడై తండ్రి వరవడిలోనే నడచి మరింత గడించి యుబ్బినాడు. నడివయసులోనే యితనికి తగనివ్యాధి యొకటి సంక్రమించి యితడెంతయో డబ్బు ఖర్చుపెట్టెను.

"ఒరే! ఈడబ్బు పాపిష్టి డబ్బురా బాబు! ఒకరూపాయి ఖర్చుపెట్ట వలసినచోట పదియైనను ఖర్చుపెట్టి దీనిని విడుదల చేసినచో నేను బ్రతుకుదు నేమొ" అని కుళ్లుగుమ్మడికాయవలె నున్నయారోగి విలపించి విలపించి యెంతడబ్బు ఖర్చుపెట్టినను చివర కతని ప్రాణపక్షి ఆస్పత్రిలో నెగిరిపోయెను.

"ఎంత ధనవంతు డైనను ఆరోగ్యముగ నుండవలెనన్న బీదవాడు జీవించునట్లే జీవింపవలెను." అని మరియొక జీవిత వేత్త నిష్కర్ష గా చెప్పినాడు. 'లక్షాధికారియైనను లవణ మన్నమె కాని వెడింబంగారంబు కుడువబోడు.' అని మన వేమనయోగి చెప్పలేదా? ధనమున్నంత మాత్రమునుచేత గృహ శాంతి చక్కనిబుద్ధి నిర్దుష్టమైన యారోగ్యము మిత్రగణము చేకూరుటలేదు. "టి. జి. దేశపురాజు అమితధనవంతుడు. కాని యతని నొక్కడును ప్రేమింపకుండెను. పైకీ యనునతడు క్షుద్బాధచేత చనిపోయెను. నేటికిని ప్రజలతనికొరకు దుఃఖించు చునే యుందురు." అని కన్ఫ్యూషియస్ వ్రాసెను.

ప్రపంచములో నత్యంత సుఖవంతులు నుత్కృష్టులు నుత్త మోత్తములు చాలమంది బీదవారే. వర్డ్సువర్తుకవి యతని సోదరి చాలకాల మతితక్కువతోనే కాలముగడపిరి. ఆకాల మతనిజీవితములో నతిముదావహమైన కాలము. "హృద యమునుండి వెలువడు భావసంపదయే మానవుని యైశ్వర్యము." అనిబర్మాదేశములో నొకసామెతకలదు. "రాజహర్మ్యము

లలో నివసించుచు గర్వపడదగినది ఆశ్చర్యపడ తగినది. యేమియు లేకుండుటకంటె భవ్యహార్మ్యము లాశ్చర్యపడునట్లు, ఒకకుటీరములో జీవించుటే బహుశః యెక్కువసుఖప్రదమైనది" అని రస్కిన్ మహాశయుని వాక్యముకలదు. మనబమ్మెరపోతన్నయే దీనికి తార్కాణము. తన ప్రభావముచే పోతన్న బంగరు తూగుటుయ్యాలలలో నూగిన శ్రీనాథకవిని యెదిరించెను.

"పొదుపు దానంతటదియే గొప్పయాదాయమునకు మూలము." అని సెనికాకవి వచించెను. కొద్దియార్జనలనే చేయుచు దానిలోనే మిగుల్చుచు పెద్దసంసారు లయినవారి నెందఱినో చూతుము. తనయాదాయమెంతయో చూచుకొనకుండ ఖర్చుచేసి 'ఆదివారమునా డందలము సోమవారమునాడు జోలె' యై నాశనములైన సంసారము లెన్నియోకలవు. ఒడలెరుగకుండ చేయుఖర్చులో గుణమేమియు నుండజాలదు. పెద్దప్లీడరుగారితో సంబంధముచేసికొనుటయే గొప్పయనుకొని యొకయనాయిక బ్రాహ్మణుడా వివాహముతోనే తనకున్న సమస్తము అమ్ముకొని వారింటికే చేరవలసివచ్చెను.

"పొదుపుపాటించు అలవాటు లేనివాడు క్షణమందే దారిద్ర్యబాధితుడగుచున్నాడు. పొదుపులేనిదే ధనసంతు డయినవాడు లేడు. పొదుపు కలిగిదరిద్రముతో బాధపడువాడును లేడు." అని జాన్సన్‌కవి నుడివినాడు. పొదుపరితనము కొన్ని

నియమములకు నిగ్రహములకు దారిచూపును. మిగుల్చుటల వాటు కలిగియుండుటయే యొకవిద్య. అది యితరసుగుణములను పోషించును. క్రమమును దోహదము చేయును. స్వార్థచింత నరికట్టును. దూరదృష్టి కలిగించును. మనసును విశాలపరచును.'' అని మరియొక కవి యుద్ఘోషించెను.

శరీరములోనున్న వీర్యమును చిమ్మివేయుట యెట్టిదో ప్రమాణజ్ఞానము లేకుండ చేతనున్న పైకమును చిమ్మివేయుటయు నట్టిదే. ఇక ఋణముచేసి ఖర్చుచేయుట మరింతయధ్వాన్నమైనది. ఒకమాటు దీనిని అలవరుచుకొందుమేని యది మనల నిక సైతానువలె విడిచిపెట్టదు. ఇది ఋణముచేసి ఘృతము తాగుట అనునుతములోనికి దింపును. ఋణము నిస్పృహకు దారిచూపును. నిస్పృహవలన మానవుడు నిస్తేజుడగును. నీరు కారిపోవును. ఋణముచేసినవాడు తానేకాక తనరాబోవు సంతతినికూడ తనఖా పెట్టుచున్నాడు. ఇదియొకవిధముగ సంఘమున కపకారమే యగుచున్నది. ఋణము దొరికితే యేనుగునైనను కట్టివేయువాడు జమీందారీలనైనను కొనివేయు స్నేహితుడొకడు కలడు. తన యాదాయములోను ఖర్చులలోను ఈయనకు నిమిత్తములేదు. చివరకీయనకు 'అత్తవారిచ్చిన యంటుమామిడితోట, తన తండ్రి సంపాదించిన బంగారమువంటి మాగాణిభూమి యమ్ముకొని పువ్వులమ్మిన చోటనే కట్టెలమ్ముకొనవలసివచ్చెను.

పొదుపు ఒబ్బిడి సుఖమును హాయినిచేకూర్చును. పొదుపే ఒకకళ యని చూచితిమి. పొదుపునెరిగినవాడు కాలమును వృథచేయడు. దూబరాచేయు వ్యక్తికి కాలముయొక్క విలువ తెలియదు. అతడు ధనముతోనే గాక కాలముతోకూడ జూదమాడు వెంగలియగుచు నీద్వివిధ జూదములవలన తన జీవిత శక్తులను దుమ్ముచేసికొనువా డగుచున్నాడు.

---



"నేను శైశవావస్థ నెరుగుదును. ఇప్పుడో నేను వయోవృద్ధుడను. కాని యింతవరకు సత్పురుషుడు దైవోపహతుడగుటగాని, యతని సంతతి తిండికై యాచించుటకాని నే నెరుగను." — సామెత

"తినుటకుండి తాను అధికుడగునట్లు ప్రయత్నింపని మానవు డెంతవరకు ప్రాపోకడా ?.."

డేనియల్

ధనము నష్టమైన పోయినదేమియులేదు. ధైర్యము పోవుట గొప్పనష్టము. కీర్తి పోగొట్టుకొనుట మరింత నష్టము. ఆత్మనాశము సర్వనాశము — డచ్చి సామెత.

పేదసాదలకు చేయి విడువని గృహము వైకుంఠమునకు దరిచిన యిల్లు కాగలదు. [illegible].



# అంతర్వాణి

•••○•••

శ్లో. సతాంహి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః॥

'సందేహ విషయములు తటస్థించినప్పుడు ధర్మాధర్మ నిర్ణయము కావలసినపుడు సత్పురుషుల యంతఃకరణమే ప్రమాణ వాక్యము' అని కాళిదాస కవి శేఖరుడు వచించెను.

నీ వెవరి స్తోత్రపాఠముల కొరకెదురుచూచుచుండవలెను? ఎవరి మెప్పులు నీకు కావలెను? నీ ఘనకార్యములను గురించి పత్రికలలో పెద్దక్షరములతో పడవలెనా? బ్రతికి యుండగనే చనిపోయినట్లు పత్రికలకు వ్రాసికొని తననుగురించి ప్రజలెట్లు స్తుతింతురో చూడవలెనని యొక సోదరుడు పత్రికాస్తుతిని అనుభవించెనట!

నిన్ను పొగడునట్టి గుంపును చేరదీసి వారికి డబ్బిచ్చి బిరుదు లిచ్చి పదవులు నొసబెట్టి పొగడించుకొనవలెనా? నిన్నింద్రుడు చంద్రుడు యని ముఖస్తుతిజేయువారు నీ పరోక్షమందు నారేమి చెప్పుకొందురో చూడుము. నీ కపుడు నిజము తేటపడగలదు. "ఇంత' దాంభికుడు పదవికోసము చేసినాడు. పొగ కేసి చేసినాడు. తెగులా? ఇవ్వవలసిన ట్లిచ్చినాడు కాడు. గుట్టుముగాడిద యొక తేనట! లేకపోతే నాకింత తక్కువా?

నేనేమి తక్కువవాడనా? ఇంతకు వీడితాతగారి సామ్మా! క్లార్కుమార్కెటుగాడేకదా? పైగా ముద్దర గుద్దినాడట." ఇట్టి మాటలే నీ వెనుక నీవిచ్చిన సొమ్ము లింకను జీర్ణము కాక మునుపే చెలరేగుచుండును.

నిన్ను భట్టువలె పొగడు కవులచే పద్దెములను కృతులను గొనవలెనా? ఫోటోలు తీయించుకొని పత్రికలకు నీవే పంపి యవి పడువరకు తహతహ లాడుచుండవలెనా? డబ్బు నీవే యిచ్చుకొని నీ పేర టీపార్టీలు చేయించుకొనవలెనా? అన్నాతురులగు వోటరులను మభ్యపెట్టి డబ్బు చిమ్మి వోట్లు కొని కొంపలలో నుండి పోవలెనని యదరించి బెదరించి గెలు పొంది జై యనిపించుకొన వలెనా? ఇది యంతయు నే కర్మలో చేరును? ఇది యూరకపోవునా. ఇది వంచన! ఈవంచన యెవ రికి? నీకే! ఇది నిన్ను నీవే చేసికొను యాత్మవంచన. "తగునిది తగదని యెదలో విడువక పలికెడి" నీ యంతర్వాణి యంత రాత్మ యంతఃప్రబోధము యొక్క మెచ్చికోలు ముందర యివి యన్నియు దిగదుడుపుకైనను పనికిరావు. చనిపోవుటకు ముందు ఔరంగజేబు చక్రవర్తి గావించిన విలాపమును నీవు విని యుంటివి. అంతవరకు నాత్మవంచనజేసికొనిన యౌరంగ జేబున కిక నది యసాధ్య మయ్యెను.

ఇతరుల దూషణ భూషణల స్వభావము గ్రహించితివి. పత్రికలు ప్రజలు నిన్ను గురించి చేయు దూషణ భూషణాదులే

ని వు మరియు నక్కరలేదు. కృంగ నవసరమును లేదు. నిన్ను గురించి నీ యంతరాత్మ చెప్పు నిక్కమైన యభిప్రాయమే నీకు నిజమైన కొలబద్ద. నీ వృత్తి నైపుణ్యము లనది సూచించుచునే యుండును. తప్పు చేయవలదని యది యెల్లప్పుడు వారించుచునే యుండును. ఒప్పు చేయుమని నిన్నత్యంతము హెచ్చరించుచుండును. తప్పుచేసి నపుడు మందలించును. ఒప్పు చేసితివేని నిన్నాశీర్వదించును. ఇదెన్నడు నిద్రింపదు. ఇది జీతబత్తెముల నడుగక యెల్లపుడు నీ సేమము గోరుచునే యుండును. నీ సేవ చేయుచుండును. పార్లమెంటరీ చర్చలలో సభ్యులను మేల్కొలుపు 'విప్పు'ల వలె నీసేవ చేయుచుండును. ఇది నిన్ను మత్తునుండి, ప్రమాదములనుండి మేల్కొల్పు కొరడా. తప్పు చేయకుండ ప్రేరేపించును. చేసిన తర్వాత మందలించి మరి యొకసారి యా త్రోవను పోకుండ హెచ్చరించును. ఇంకొక చిత్రము, పత్రికలు పొగడుచుండును. కవులు యింద్రుడు చంద్రుడు అని యెలుగెత్తి యేనుగుల నెక్కించుచుందురు. వేదికలమీద గద్దెల నలంకరించి చందనాది సత్కారముల నొందుచుందురు. గండభేరుండంచుల పంచలు, సెల్లాలు ఠీవిగ నెగురుచుండును. ఇంతలో నంతరాత్మ "నీవు వంచకుడవు నీవు దొంగవు స్త్రీధనాపహారివి. ఎందరి నెత్తురో కొల్లగొట్టి యాస్తి భార్యపేర వేసికొనిన వాడవు. లక్షలు లంచముపట్టి వీరిపేర వారిపేర దానిని దాచినవాడవు—అని లోపల కొట్టుచుండును. హృదయము తటతట కొట్టుకొనుచు దొంగనోటులు అధర్మ

వడ్డీలు కూటసాక్ష్యములు పిచ్చకుంచములు నమ్మినవారి యాస్తుల నపహరించుట మొదలగు జనకంటక కార్యపిశాచములు వేయి నాలుకలతో నీపై సాక్ష్య మిచ్చుచుండును.

షేక్స్పియరు ఆంగ్ల కవిసార్వభౌముడు. అతడు మానవ చైతన్యములను చిత్రించుచు నెన్నియో నాటకములను వ్రాసెను. అందు మూడవ రిఛర్డురాజు నాటక మొకటి: అతడు మృత్యుశయ్యమీద నుండగా అతనిచే చంపబడిన యన్నదమ్ములు, భార్యలు, రాజులు, ప్రజలు మొదలగువారి దయ్యము లన్నియు నొకటి తర్వాత నొకటి యెదుటకు వచ్చి యతడు చేసిన రాక్షసకృత్యముల నన్నింటిని పేరుపేరున యెత్తి చెప్పుచుండ పూర్వపు స్తోత్రపాఠకులు, వందిమాగధులు, పండితబ్రువులు, శాసనసభ్యులు, దొంగమంత్రులు నతని మనస్తాపోపశమనంబు చేయజాలరైరి.

బీదజన రుధిరపాన జనిత ధనము నీకు సుఖము నిచ్చు ననుకొనెదవు! ఇది జయ మనుకొనెదవు. దీనికై ప్రజల స్తుతి పొందెదవు. సమయము వచ్చినపు డివియే సాక్ష్యమిచ్చి నీ బండారము బయటపెట్టును. మానవునకు తన యంతరాత్మ ప్రసాదింపని శాంతి, యది యామోదింపని కృత్యమును మఱపింపగల రసాయనాదులు నింతవరకు కనుగొనబడ లేదు. ఇక ముందును కనుగొనబడజాలవు.

అంబరీషుని యవమానింప జూచిన దూర్వాసు డేలోక మునకు బోయినను విష్ణుచక్ర మతనిని వెంటాడి విడువ దయ్యెను. నీ వెందుబోయినను యెందుడాగినను, నెంతటి యనన్యసామాన్యశక్తి సంపాదించి లోకము నెదిరింపగల్గినను నీ యంతరాత్మ మాత్రము నిన్ను వెన్నంటుచునే యుండును. నీ యంతరాత్మయే నిన్ను వెంటాడు విష్ణుచక్రము.

కనుక యంతరాత్మను కనుగొని యాదరించువాడే ధన్యుడు. అది మనకు పరమ మిత్రము. దాని సూచనలను మనమెన్నడు జవదాటరాదు. అది కూడదని చెప్పు పని చేయరాదు. మందలింపు వచ్చినపు డాగి నే నేమి చేయబోతిని? ఎక్కడకు బోవుచున్నాను? దాని ఫలిత మేమి? అని నిన్ను నీవు ప్రశ్నించుకొన వలెను. తప్పులేనిదే మందలింపు రాదు. వచ్చిన తర్వాత నాలసింపక నీవు దిద్దుకొన వలెను. ఇట్టి సందర్భములో రాజీ, చూచీచూడకుండ బోవుట పనికిరాదు. ఇనుము కాగినపుడే సమ్మెటపోటు పడవలెను. అది చల్లబడిన తర్వాత కార్యము మించిపోవును.

నావికుడు సముద్ర మధ్యమున యోడ నడపుచుండును. దిగ్దర్శన యంత్రము దిక్కులను తప్పక చూపుచుండును. గొప్ప తుపాను చెలరేగుచుండును. దిగ్దర్శిని చూపు దిక్కు నాదరింపక నావికుడు ముల్లును బలవంతముగ తన యిచ్ఛవచ్చినట్లు తిప్పచూచును. దాని వలన యోడ పర్వతములకు, తిప్పలకు

కొట్టుకొని పగులుట మానునా ? తమ యంతర్వాణిని, యంత రాత్మను, యాదరింపక జీవిత సముద్రమున భంగపడిన వారెం దరుతేరు ?" అని మార్డెన్ వేత్త ప్రశ్నించుచున్నాడు.

అంతరాత్మయొక్క ఆమోదమును బడయుటకు నిజాయితీ. సత్యము ధర్మము న్యాయమునగు జీవితము గడుపవలెను. గిల్టు నగలను బంగారు వస్తువులని యమ్మవచ్చును. గజముబద్దలను పిశెరాళ్ళను తబ్బిబ్బు చేయవచ్చును. పనిచేయకుండ పనిచేయు చున్నట్లు నటింపవచ్చును. కాని నీయంతరాత్మను జోకొట్టిన గాని నీవట్లు చేయజాలవు. ప్రాణములేని శరీరము అంతరాత్మను పోగొట్టుకొనిన ప్రాణి నిరర్థకము.

శ్లో. ఏకోహ మస్మీతిచ మన్యసే యది త్వం
నహృచ్ఛయం వేత్తి మునిం పురాణం
యో వేదితా కర్మణః పాపకస్య
తస్యాన్తికే త్వం వృజినంకరోషి. ॥

" నేనొక్కడనే యున్నాను. నన్నెవరును చూచుటలేదు. అని నీవనుకొందువేని నీహృదయములోనున్న పురాణ మునిని నీ వెరుగకున్నావు. అతడు నీసమస్తకర్మలను చూచుచున్నాడు. అతని సమక్షముననే నీవు పాపము చేయుచున్నావు." అను వాక్యము లెంతటిసత్యములు !

శకుంతలను దుష్యంతు డెఱుగనట్లు నటించుచు నిండు సభలో నామెను పరస్త్రీవలె ముట్టినాడును. ఆమె యతని నెట్లెదుర్కొనెను ?

చ. విమల యశోనిధీ పురుషవృత్త మెఱుంగుచునుండు చూవె వే
దములును బంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్
యముడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్నమహాపదా
ర్థము లివి యుండగా నరుడు దక్కొననేర్చునె తన్ను ద్రుచ్చిలన్.

దీని కతడేమి సమాధాన మీయగలిగెను. ఇన్ని భూతములు సాక్ష్యముండగా నీచేష్టలను నీవెట్లుదాచుకొనగలవు? కలిమి కలుగుచుండును. మరి లేకుండును. ఒడలు బడ్లగును. బండ్లు ఓడలగును. నిన్నటిపదవి రేపు లేకపోవచ్చును. ధనధాన్యాది సంపత్తులు హరింపబడవచ్చును.

బందుగులు తోటివారు పైవారు కూడ నిన్ను నిందింపవచ్చును. నీ వొంటరివాడవు కావచ్చును. ఎన్ని సంకటములు చేకూరినను నీ యంతరాత్మ నిష్కళంకముగ నున్నచో నీ నిజాయితీ మొక్కవోకయున్నచో నీవెన్ని ప్రపంచములనైన నెదుర్కొనవచ్చును. అప్పుడు తిట్లు, వంచనలు, దుర్మార్గము

లోకులదగును. ఆనందము, విజయము నీసొమ్ములగును. ఆత్మ సుఖము ముందు ఇతర సుఖములు తృణసమానములు. అంత రాత్మ, యంతర్వాణి లేదని వాదించువారు దాని మహిమను యుఁకిని యెరుంగనివారు కొంద గుండవచ్చును. కొంతిమంది యననేల! చాలామంది యుండవచ్చును. అంతమాత్రముచే దాని ధర్మ మాగిపోవుటలేదు. గురుత్వాకర్షణశక్తిని మనము గుర్తింపనినాడును పైకెగురవేయుబడు వస్తువు భూమిమీదికే వచ్చి చేరెను. చెవి యొగ్గి వినువారి కంతర్వాణి వినుపించు చునే యుండును. నిశీథమందు ప్రకృతి యంతయు నిశ్శబ్దముగా నున్నపుడు రాగద్వేషాదుల క్రీడ చల్లారినపుడు లేచి నిన్నొక సారి తడవి చూచుకొనుము. దేవాలయము ప్రవేశించునపుడు మ్రోగు ఘంటానినాదమువలె నీ కది వినిపించు చుండును. నిరంతరాభ్యాసముచే నిది మరింత ప్రస్ఫుట మగుచుండును. దీని నాదరించిన కొలది తేజరిల్లును. నిరాదరణ జేసినచో మొద్దుబారిపోవును.

ధృతరాష్ట్రుని చరిత్ర మనమెగిరినదే! విదురుడు, భీష్ముడు, ద్రోణుడు మొదలగువారు నిక్కమాడినపు డతడు 'ఊ' కొట్టుటయే గాక వారు చెప్పిన దంతయు నిజమే యని యొప్పుకొనును. అట్లాచరించిన యుభయ కటకముల వారికి నేమమే యనుచుండును. కాని యీయంతరాత్మ చెప్పినట్లు చేయడు. కుమారునిచేత చేయింపడు. పుత్రమోహముచే నత డంతరాత్మను దూరీకరించి తన్ను తన వంశమును తొక్కిన

రాజలోకమును హతమొనరింపజేసి నేటివరకు తిట్లు తినుచు చున్నాడు.

యేపనినైన యంతఃకరణ శుద్ధితో జేయుమని యందురు. దీని భావమేమి? మనసేది చెప్పునో దానినే నోటితో చెప్పుము. పలుకెట్లో యట్లే యాచరింపుము. ఇట్లు చేయువానినే లోకము విశ్వసించును. మహాత్ముని లోకము మెచ్చుకొనుట కేమి కారణము? అతనియొద్ద దాపరికమేమియు లేదు. అంతరాత్మ చెప్పుదానిని చక్కగా విని దానినే నోటితో పలుకును. ఏది పలుకునో యదియే యాచరించును. నేడతని వాణియే ప్రపంచమున ప్రతిధ్వనించుచున్నది.

అంతఃకరణ శుద్ధియొక్క మాహాత్మ్యమును బోధించు మరియొక యితిహాసము కలదు. అర్జును డుత్తరగోగ్రహణ కాలమున పోరులో నజ్ఞాతవాసమునుండి బయల్పడెను. చావదెబ్బలు తినిన దుర్యోధనాదులకు అజ్ఞాతవాసగడువు జ్ఞప్తికి వచ్చి యాసాకుకొరకానపడిరి. భీష్మద్రోణాదు లాగడువుదాటిపోయినదని చెప్పిరి. వారు పాండవపక్షపాతులని దుర్యోధనాదులు వారి మాటలను విశ్వసింపరైరి. ఇక నీ సంశయమును తీర్చువారెవరు? దుష్టచతుష్టము వారీ సంశయము నొక్క ధర్మరాజే తీర్చగలవాడని నిశ్చయించుటయు ధర్మరాజు 'నిండె, నిండె' నిండెనని ముమ్మారు చెప్పిన వాక్యములను వారు శిరసావహించుటయు జగద్విదితముకదా! అంతశ్శుద్ధియొక్క గొప్పతనమున కింకెట్టి సాక్ష్యము కావలెను?

నీ శోకములు బిరుదులు వెండి బంగారములు చివరవరకు నీతో నుండవు. నీ చేష్టలు భావములు మార్గము నిన్ను వెంబడించును. "నీ మనస్సులో నేమికలదు ? అని నిన్నెవరేని ప్రశ్నించుచో కించిత్తు నాపరికములేకుండ వెంటనే దానిని చెప్పివేయగలవాడే ధన్యుడు" అని అకిలియస్ చక్రవర్తి వచించినాడు. నిష్కల్మషు డొక్కడే యిట్లు చెప్పగలడు.

శ్లో. తుషాకర బింబాచ్ఛా మనోయస్య నిరాకులం
మరణోత్సవ యుద్ధేషు సశాంత యితికథ్యతే.

"ఎవని మనస్సు పూర్ణచంద్రునితో సమమింపదగిన స్వచ్ఛతను కలిగియుండునో యుద్ధమును మరణమును కూడ నెవ దుత్సవమువలె పరిగణించునో యతడే శాంతాత్ముడు" అని చెప్పబడుచున్నాడు. శాంతాత్ములే నిత్యసుఖులు.





ఈ ప్రపంచము స్వర్గములో దట్టింపబడియే యున్నది. ప్రతి సామాన్య పొద (మానవుడు) భగవంతునితో దీప్తమై యున్నది. కాని చూడగలవా రొక్కరే దాని ననుభవింప గలరు— బ్రౌనింగు సతి.

మిత్రుడా ! మన మొకరిక్రింద పడియుండిన దోషము మన నక్షత్రములది కాదుసుమా : అది మనదే : ముమ్మాటికి మనదే——షేక్స్పియరు కవి.

శీలవంతులు తమ దోషములను వినగోరుదురు. తక్కిన వారు విననొల్లరు— ఎమర్సను కవి.

శ్రమము, సంతోషము, మితము వైద్యునికి స్వస్తి చెప్పును.





# మనః ప్రభావము

శ్లో. మనయేవ మనుష్యాణాం కారణంబంధమోక్షయోః॥

మానవునకు స్వేచ్ఛ, బంధనము కల్పించునది మనస్సే. మనస్సే సమస్తమునకుమూలము. నీవనుభవించు సమస్తమునకు నీవుపొందు సమస్తమునకు మనస్సే కారణము. మనశ్శక్తి లేక మననశక్తి యపూర్వమైనది. చింతించు శక్తి, యోచనచేయు శక్తి మన స్సనబడుచున్నది. ఈ శక్తి కలవాడే మానవుడు. ఇదిలేనినాడు, లేనివాడు కాళ్లుచేతులు గలకట్టె, మొద్దు లేక తోలుబొమ్మ, అనగా మనశ్శక్తిలేనివాడు, దానిని గుర్తింపని వాడు, దానిని వృద్ధిపరచని వాడు మానవుడే కాడు. పశుపక్ష్యాది జంతుజాలములకుకూడ మనస్సుకలదు. కాని యది వాటిలో నిద్రాణమైయుండును. మానవునిలోనే యది పూర్తిగ వికసించు చున్నది. మనస్సు వికసించి నపుడే మానవుడును వికసించు చున్నాడు.

మానవుడు తన యింద్రియముల ద్వారా పని చేయును. మనఃప్రేరణ లేనిదే యింద్రియములు పని చేయజాలవు. మనస్సు లేనిదే కన్ను చూడజాలదు; చెవి వినజాలదు. మనస్సంకల్పము లేనిదే యే యింద్రియము కదలుటలేదు. మనస్సన్యథాయత్త మైనపుడు నీ యెదుట నున్న వస్తు వెంతఘనమైనదైనను కన్పిం

చుటలేదు. అప్పుడు నిన్ను గురించి పలుకుమాట నీకు విని పించుటలేదు.

మనస్సు వికలమైనపుడు మృష్టాన్నమైనను నీకు రుచించుట లేదు. నిద్రపట్టుటలేదు. తినినతిండి జీర్ణమగుటలేదు. సర్వేంద్రి యములతోను మనస్సు కూడినపుడే జగద్వ్యాపారము జరుగు చున్నది, ప్రారంభమగు చున్నది. ముగియుచున్నది.

మనస్సు యింద్రియము కాని యింద్రియము. కన్ను, ముక్కు, చెవి మొదలగు వానివలె దీనికొక స్థానము రూపము లేని చిత్రమైన యింద్రియము. ఇది యింద్రియముల నన్నింటిని వెనుకనుండి యాడించు యింద్రియము. మానవునే నిరూపించు నిక్కమైన యింద్రియము.

శ్లో. భృత్యోఽభిమత కర్తృత్వాన్మంత్రీ సత్కార్యకారణాత్।
సామంతశ్చేన్ద్రియాక్రాంత్యా గురుర్విద్యాప్రదానతః।
లాలనాత్ స్నిగ్ధలలనా పాలనాత్పావనః పితా
సుహృదుక్తంచ విశ్వాసాత్ మనోమన్యేమనీషిణాం॥

అని యోగవాసిష్ఠ గ్రంథకర్త మనఃప్రభావము నతి రస వంతముగ వర్ణించినాడు. వివేకవంతుని మనస్సు భక్తిపురస్సర ముగ పనిచేయు సేవకునివంటిది. ఇంగిత మెరింగి సత్కర్మల నాచరింప జేయించునట్టి మంత్రిపుంగవుని వంటిది. ఇంద్రియ గణమును జయింప సమర్థమైన దగుటచే సామంతుని వంటిది.

సంతతానందప్రదాయి యగుటచే హితకార్యాచరణచే నుప లాలించు ప్రేమరసాలయగు ధర్మపత్ని వంటిది. రక్షింపగల శక్తి కలది యగుటచే పావనమూర్తి యగుతండ్రి వంటిది. ఉత్తమ విశ్వాసమునకు పాత్రమైన దగుటచే పరమమిత్రము. ఇన్ని సుగుణములుగల మణి నీలోనేయున్నదని, నీవేయని, యిది ప్రతివానికిని ప్రసాదింపబడిన మణి యని పై గ్రంథకర్త వేనోళ్ల యెలుగెత్తి చాటినాడు.

దీనిని నీవు కనుగొనినచో సుట్టిలో మణగియుండు మణివలె నిది నీయందే యణగియుండును. దీనిని చక్కగదర్శించి, చక్కగ శిక్షించి, చెదరకుండ చిక్కబట్టి యుక్తియుక్తముగ నుపయోగించినచో నీకు సమస్తసుఖములను, సర్వసిద్ధులను చేకూర్చుచు నీలో ప్రకాశించుచు నిన్ను దీవించు దివ్యమణి. ఇది వివేకులహృదయముల నలంకరించుచు నలుదెసల తనకాంతిని ప్రసరింపజేయును; అవివేకులహృదయములలో రాక్షసిబొగ్గు, అంధకారమయము, అజ్ఞానకూపము, ప్రమాదాలస్య కంటకయుతము నగుచున్నది. సాన వెట్టినకొలది మణి తేజరిల్లుచుండును. నిగ్గు తేలుచుండును. అట్లే మనస్సును శిక్షించినకొలది, ప్రబోధించినకొలది, కేంద్రీక రించినకొలది యెంతటి చీకటిలోనైనను అది ధగధగ మెరయుచుండును. ఎంతటి చిక్కుసమస్యలు, ఎంతటి విపత్కరపరిస్థితులు సంభవించినను మహాత్మునకు వెలుతురు ద్యోతకమగుచునే యుండెడిదని మనము ఆయనయాత్మకథ ద్వారా తెలిసికొంటిమి.

కనుక నిట్టిమనోమణి యున్నచోట చీకటికి నిలువనీడ యుండనేరదు. చీకటి కొండలు దీనిముందు పలాయనమగును. వ్యవసా యాత్మికమైన బుద్ధి యేకాగ్రతకలది యగుటచేత కర దీపమువలెగాక సెర్చిలైటు వలె నెంతదూరమైనను చూపును. దానిని శిక్షింపక నవ్యవసాయ మనస్కులైన వారిబుద్ధి కోతి చేష్టలు కలదియై యటునిటుపరుగులెత్తుచు బహుముఖములుగ ననంత శాఖలుగ చీలిపోవునని గీతాశాస్త్రము నిష్కర్షగ చాటి చెప్పుచున్నది.

మనస్సు గొప్పక్షేత్రము. అపూర్వమైన కర్మక్షేత్రము, కురు క్షేత్రము. ఈక్షేత్రమున నీవు దేనిని విత్తుదువో యాఫల మునే కోసికొనగలవు. దీనిని నీవెంత చక్కగా, శ్రద్ధగ, నిరంతరాయగము వ్యవసాయము చేతువో యంత యెక్కువ ఫలమును పొందుదువు. వ్యవసాయమును హాలముఖమును నెరుగనిచేను బీడుపడునట్లు వ్యవసాయము, కృషి, ప్రయత్నము నెరుగని మనస్సు వంధ్యయగును. పరిశ్రమ నెరుగని మనస్సులో వ్యవసాయము నెరుగనిభూమిలో కలుపు తుప్పలు, కంటక వృక్షములు బయలుదేరినట్లు పాపచింతలు, దుఃఖములు, సోమరితనము, నిరాశ, దురాశ నిర్వీర్యత ప్రమాదాలస్యములు మొదలగు వికారములెన్నియో బయలుదేరును. ఇట్టి యశి క్షిత మనస్సుకు ప్రపంచము జీవితము భారవహ మగును. దుఃఖమయమగును.

కాళ్లు, చేతులు, కన్ను, ముక్కు, పనిచేయుటకుపూర్వము మనస్సుయొక్క ప్రేరేపణ యుండవలెనని మనము గ్రహించితిమి. కాని కాలియవసరముక్కరలేకుండగనే మనస్సెంతదూరమైనను కనురెప్పపాటులో పోవుచున్నది. మనోవేగము వాయువేగముకంటె వడిగలది. కంటియవసరమక్కరలేకుండ మనస్సు చూడగలదు. చెవినంటదు వినగలదు. వాసనచూడగలదు. పనిపట్టగలదు. కేంద్రీకరించినకొలది దానిప్రభావ మతిభాసమానమగుచు నెల్లలులేనిరాజ్యమును స్థాపించుకొనును. "మానవుని మనశ్శక్తి కెట్టిపరిమితియు లేదు. దానినొకవిషయముమీద నెంతయెక్కువగ కేంద్రీకరించిన నంతయెక్కువశక్తి నొసగుచున్నది. ఇదియే దీనిరహస్యము." అని వివేకానందస్వామి వచించెను.

మనస్సు ననేకపేళ్ళతో పిలువవచ్చును. ఈపేళ్ళలోను, ఈ యవస్థలలోను కొద్ది ఛాయాభేదముండునేమోతప్ప వస్తుతః భేదములేదు. సంకల్పము, మనస్సు, చిత్తము, బుద్ధి, వాసన, జీవుడు వీటిభేదములు నామమాత్రములు. వస్తుతః భిన్నత్వము, భేదము వీనికిలేదని వసిష్ఠుడు నిర్వచించెను. రంగులువేయునేర్పరి చేతిలో ఛాయలేవిధముగ సునాయాసముగ మారిపోవుచుండునో యట్లే యుక్తిపరుడు తనమనస్సును నిష్టమువచ్చినట్లు స్వాధీనముచేసికొనవచ్చును. మనస్సును వశపరచుకొనుయుక్తి చాలతేలికమైనది. "చేతనున్న పుష్పములను నలుపుటకైనను కొంత హస్తప్రయోగమవసరము. కాని సంకల్పమును నా

నముచేయుట కా యవసరముకూడ లేదు.'' అని రామునకుప దేశింపబడెను. సంకల్పింపకపోవుటయే సంకల్పనాశనమునకు మార్గము. 'వజ్రం వజ్రేణభిద్యతే.' వజ్రమునువజ్రమే ఛేదింప గలదు. మనస్సును మనస్సే విరవగలదు. దానికదియే చికిత్స చేసికొనగలదు. అదియంతసులభమైనదైనను యేకొద్దిమంది మాత్రమో తత్సిద్ధికిప్రయత్నింతురు. ఇదియేమానవ విషాదము నకుమూలము.

నీచసంకల్పములు నిన్ను క్రిందకు దిగలాగును. ఘనసంక ల్పము లున్నతికి గొనిపోవును. నీ సంకల్పములను బట్టియే నీ కార్యము లున్నతాధమ శ్రేణికి చెందుచుండును. కనుక నిన్ను నీచభావము లాక్రమించునపుడు తడవు సేయక నీవు వాని నున్నతభావములతో కొట్టివేయవలెను. సూర్యుని ముందు మంచు పలాయనమగునట్లు త్తమభావ ప్రకాశములో నీచభావ తిమిరములు కరగిపోవును.

"దుశ్చింతలకును దురభ్యాసములకును మారుగ మంచి భావములను మంచికార్యములను అలవర్చుకొనుము. అదొక్క టియే సూటియైన మార్గము. దురభ్యాసముల వలన కలిగిన యానవాళ్లు నన్నింటిని సదభ్యాసములచే తుడిచివేయుము. నిరంతరము మంచినే చింతించుచు పవిత్రకార్యములనే చేయుచు ప్రవర్తింతుమేని చెట్ట దానంతటదియే నశించును.

ఎట్టివానిని గురించియు నిరాశ చెందనవసరము లేదు. నూటికి నూరుపాళ్లు దుష్టుడను వాడుండడని షేక్స్పియరు మహాకవి తన యపూర్వనాటక పాత్రలద్వారా ఋజువుపరచి యున్నాడు. "ప్రతివ్యక్తి కొన్ని యభ్యాసముల యొక్కయు కొన్ని గుణముల యొక్కయు ప్రతిమ లేక మూర్తి; కనుక వీని నెప్పుడైనను నూతన భావములతోను సద్భావములతోను తుడిచివేయ వచ్చును."

పై సూక్తులు సువర్ణాక్షరములు. అనుభవ ప్రేరితములైన యమృతబిందువులు. ఉన్నతియే నీ నిజలక్షణము, నీ నిజసంపద కాని నైచ్యము నీ నిజసంపత్తి కాజాలదు. మానుషీధనము కేవల మార్థికసంపత్తు మీద నాధారపడునది కాదు.

మనస్సును పవిత్రవంతము, శక్తివంతము, తేజోవంతము చేయు దానినే విద్యయని పిలువదగును. శైశవమాదిగ నిట్టి శిక్ష యున్ననాడు దొంగతనములు, దుర్వ్యసనములు కలిగి ద్రిమ్మరి తనములచే పాడైపోవు బాలురసంఖ్య తగ్గిపోవును. ఈ బాధ్యత యంతయు తల్లిదండ్రులపై నెంతయో కలదు.

"నేటితలిదండ్రులు పిల్లలను కనుటయే యెరుగుదురు. కాని వారి లాలనపాలన నెరుగరు. వారు పిల్లలకు గొప్పవిషయములను బోధింపరు. సరికదా! వారేమేమి తినవలెనో, యెట్లు తిన వలెనో, యెంత తినవలెనో, యెచ్చట నేవిధముగ నంచరింప వలెనో చివరకు వేగముల నెట్లు తీర్చుకొనవలెనో తెలుపుదలగు

సామాన్య యారోగ్యవిధులను కూడ బోధింపకపోవుట కడు శోచనీయము" అని విద్యార్థి వసతి గృహమును నడిపించిన యొకస్వామి గృహస్థుల ధర్మచ్యుతిని గురించివిలపించుచు తనకే యధికారమున్నచో వారిని దండించి యుండెడివాడనని వచించెను. ఇందులోనతిశయోక్తి యెంతమాత్రములేదు. చిన్నతనమునుండియే, బాల్యావస్థలోనే పిల్లవానిమనస్సును దోహదము చేయవలెను. 'తోటకూర నాడే చెప్పవై తివిరా కొడకా' అని వాపోయిన తల్లి తనపిల్లవాని హావభావములను చైదములను చిరుతప్రాయమునుండియే పరిశీలించవలసిన బాధ్యత తనదే యని గుర్తింపదాయెను. ముదిరిపోకుండ లేతగనున్నపుడే వంచబడి రంగులు, నగిషీలు చిత్రింపబడిన వెదురు పల్లకియొక్క శిరోభాగమై నూత్నవధూవరుల నాశీర్వదించుచున్నది. రాజుల యొక్కయు రాణులయొక్కయు కిరీటముల పైన నోయార ముగ రాణింపాసము చేయుచున్నది. కాని యేశిక్షయు నెరుగని ముదిబొంగు దిక్కుమాలి దొమ్మరిసాని కాలిక్రింద మర్దింపబడుచున్నది.

కౌమారావస్థ యతిముఖ్యమైనది. లలితమైనది. జీవితమున కంతకును పునాది వంటిది. ఈస్థితిలో మనస్సు నెట్లు తీర్చిదిద్దిన, నెట్లు శిక్షించిన మానవు డట్లు తయారగుచున్నాడు. ఈ సమయమున నేశిక్షయులేని మానవుని జీవితము వ్యర్థమగుచున్నది. శిక్షయే మానవుడు. అభ్యాసమే విద్య. అంతేకాదు: "అభ్యాసము రెండవ ప్రకృతి" యనుసామెత కలదు. చివరకీ యభ్యా

నమే మూలప్రకృతికూడ యగుచున్నది. అదియే మానవుని సమగ్రశక్తికి కారణమగుచున్నది. నేటి మన గుణసముదాయ మంతయు నభ్యాస ఫలితమే” అని యభ్యాస ప్రాబల్యమును గురించి వివేకానందస్వామి వచించినారు. అభ్యాసమే సుగుణ దుర్గుణములకు కీలక మగుచున్నది. అభ్యాసముచేతనే, కఠిన నియమములను పాలించుటచేతనే మహాత్ములందరు తమ మహిమలను సంపాదించుకొనగలిగిరి. సంతతాభ్యాసమే జీవితమునకు వరపడి యగు చున్నది. సెకనులే గంటలు, దినములు సంవత్సరములు అగుచున్నట్లు నిరంతరాభ్యాసమే పేరుకొని మహత్వమో లేక రాక్షసత్వమో యగుచున్నది. శరీర, మానసిక, యాధ్యాత్మిక శక్తిని, పటుత్వమును దక్షతను సేకరించుటకు కౌమారావస్థయే జీవితముఖద్వారము. కౌమారములో పరిశ్రమ నెరుగని జీవితము యిసుకమీద పేర్చబడిన మేడవలె కూలిపోవును. అది కష్టములకు జీవిత నిమ్నోన్నతములకు తట్టుకొనజాలక పోవుటయేగాక యేగాలివిసరిన యాగాలికే వంగి పోవుచుండును. లేదా జీవిత సంరంభ రజోధ్వాంత తిమిరములకాహుతియై పోవుచున్నది.

కనుకనే జీవితరహస్య వేత్తలగు మనపెద్దలు మొదటి యిరువదియైదు సంవత్సరములను పునాది కట్టు దిట్టముల కొరకు విడద్రొక్కినారు. ఆప్రాయములో జీవిత ప్రభావముల నిను మడింప చేయు సంస్కారములను కల్పించినారు. కుసంస్కారములకు చోటు లేకుండ చేసినారు. ఈ తెలివిని, యీపరీక్షను

యిప్పటి తల్లిదండ్రు లెంతమాత్రము పాటింపక పోవుటయే గాక నీకనుగుందుల ననేక వికృతములకు పాల్పడ నిచ్చి యిరువదేండ్లలోనే నూరేండ్లు చెల్లిపోవునట్టి వికార జీవితములకు కారకు లగుచున్నారు. ఈవిరస జీవితపద్ధతి యెంత త్వరగా మారిన యంతత్వరగా మనదేశము మారిపోగలదు. ఇట్టి న్యాయమైన, యుదారమైన, జీవితరహస్యమైన సృజనాత్మకమైన సుసంస్కారములతో బాలభారతమును రక్షించు కొనిననాడే భారతదేశము తిరిగి తలయెత్తకలదు. నేడు పిచ్చెత్తినట్టు ప్రచారము చేయబడు చున్న రాజకీయ ఘుటికలవలన యెన్నికల మదపిచ్చువలన మనమెంత మాత్రము ముందుకు పోజాలము.

కనుక బాల భారతమే దేశసౌభాగ్యమని సిమెంటు, యినుము, ఫ్యాక్టరీ పొగ, అణుశక్తియెంత బలిసి వచ్చినను నిజ మానవ సంపదతో తులతూగవని విశ్వసించు బుద్ధిమంతు లీవివిధ సమస్యలను చక్కగా పరిశీలించి, విమర్శచేసి దేనికెట్టి స్థానము నీయవలెనో యట్టి స్థానమునే యిచ్చి బాలవిద్యాలకొక నూతనప్రణాళికను తయారుచేయు టెంతయుసమంజసము. ఇది ప్రభుత్వ స్టీమురోలరు దొర్లింపులచేతను, వోటులనుసిక్కించి, రొక్కించి దొంగిలించి సృష్టించి కట్టిన నీటికట్టడములు ప్రభావముచేతను జరుగుపనికాదు. డబ్బుగుప్పి మనుష్యులను తాకట్టు పెట్టుకొని లేదా పూర్తిగాకొని వేసి రాజ్యాంగమును నిర్మింప

బూనుకొన్న రాజకీయపక్షులచే జరుపబడునని కాదు. పావ మిది వారి కందని విషయము.

ఈసమస్యను పరిష్కరించుట కెంతయో యుపజ్ఞగల బుద్ధి మంతులు కావలెను. మన స్తత్వమును జీవిత రహస్యముల నుద్యోతకము చేసికొనిన మహామహులే దీనికొక రూపము నీయదగినవారు, అట్టివారి జీవితవిధానమే బాలభారత విద్యా విధానము కాదగును. విశ్వవిద్యాలయ డిగ్రీలతో త్రుళ్లిపడిన యొక యధికారధూర్వహుడు మహాత్మునకు విద్యనుగురించి మాట్లాడు నధికారము లేదనుట కేమనవలెనో పాఠకులే గుర్తింతురుగాక!

బాల్యావస్థమీరి బాధ్యత యంతయు తల్లిదండ్రులదే యనుట కెట్టిసందియములేదు. తల్లిదండ్రులు లేనిపోని పామ రత్వమును మోహమును, సంకుచిత స్వార్థమును బేలతనమును పోగొట్టుకొని తమబిడ్డలు తమబిడ్డలేకాక మొనలేని దేశ సౌభాగ్యము అనుజ్ఞానము కలిగియుండవలెను. ఈజాతీయధన మునకు నీ యపూర్వ మానుషీధనమునకు తాము ధర్మకర్త లని దీని నన్నివిధముల పెంపొందించుట తమ విధియని గుర్తింపవలెను.

బాలశిక్ష శారీరిక, మానసిక యాధ్యాత్మిక మార్గముల ననుసంధానము చేయుచు సమగ్రరూపమును తాల్పవలెను. ఒక్కశరీరమునే పెంచువిద్య యనగా నార్థికోద్దేశకోరికలనే

యభివృద్ధిచేయు విద్యకాదు. శరీరమే మానవుడుకాజాలడు. అతడీశరీరముతోనే సమాప్తి చెందుటలేదు. అతడు శరీరి, శరీరాధిపతి, శరీర నిర్వాహకుడు. ఈశరీర మున్నంతకాలము దానిని చక్కగ కాపాడుకొనవలెను. ధర్మమును సాధించు మొదటిసాధనమే శరీరము. శరీరముతోనే మనము సమస్తమును సాధింపవలెను. రోగి దుర్బలశరీరుడు పిరికివాడు కష్టింపలేనిసోమరి నిగ్రహముచూపలేనివాడు సంఘమునకపకారము చేసినవారే యగుచున్నారు. ఈ సందర్భములో వివేకానందుని వాక్యములు స్వర్ణాక్షరములతో లిఖింపనగును.

"మనమనేక విషయములను గురించి చిలుకపలుకులను పలుకు చుందుమే కాని యాచరింపము. చేతలులేని శుష్కవాచాలతయే మనకబ్బెను. దీనికి కారణమేమి? శరీరదుర్బత్వము దుర్బలబుద్ధి. దుర్బలమైనమేధ దేనిని సాధింపజాలదు. ఈమేధను బలపర్చవలెను. దీనిని సాధించుటకు తొలుదొలుత మనయువకులు శరీరబలసంపన్నులు కావలెను. తరువాతి మత ప్రసక్తి వచ్చును. భగద్గీతను నామకః పఠించుటకంటె కాలిబంతియాటలాడుచు కేరింతలు కొట్టుకొనువాడు స్వర్గసమీపవర్తియగుచున్నాడు. నీకండరములు నీనరములు బలుపుచెందినపుడే నీకు గీతయొక్కవ సులభముగ నర్థముకాగలదు. నీలో వీరరక్తము ప్రవహించునపుడే నీవు కృష్ణుని ప్రతిభావిశేషమును శక్తిని గ్రహింపగలవు. నీశరీరము నీపాదములపై స్థిరముగ నిలుప గలిగినపుడే నీవుమానవుడవని భావింప గలిగినపుడే

యుపనిషత్తులను చక్కగ నర్థము చేసికొనగలవు. ఆత్మ ప్రభావము ననుభవింపగలవు.

దుర్బలత్వము సదా గర్హింప తగినది. ఆసనాదులు ప్రాణాయామము మొదలగునవి శరీరదృఢసంపత్తు కెంతయో తోడ్పడును. ఒడుదుడుకులు లేకుండ వీనిని లెస్సగ నభ్యసించిన వానిని రోగములు సమీపింపజాలవు. ఇప్పటి యువకులకీ సాంప్రదాయమే తెలియకపోవుట దీనిగుఱియే లభ్యము కాకపోవుట కడుశోచనీయము. ఈనదాభ్యాసములచే జీరున చీదకుండ, మందుమాకులగరికి పోకుండ నూరేండ్లు సుఖజీవనము గడపిన వారెందరో కలరని యట్టివారి యాకారములే శోభను వెదచల్లుచుండునని మనచరిత్ర చాటుచున్నది.

మనశ్శరీరముల సంబంధమతిచిత్రమైనది, లలితమైనది, యనివార్యమైనది, దురూహ్యమైనది. మనస్సులేని మొద్దు దేనిని యనుభవింపజాలదని మనమిదివరకే గ్రహించితిమికదా! మనోవికాసమే మానసవికాసము. వికసించిన మనస్సుయొక్క ప్రతిభ శరీరముమీదనే కానిపించును. మహాత్మునిరూపము మనలనాకర్షించుటలో గల రహస్యమిదియే. మనస్సును పెంపుచేయుటయే విద్య. దానిని పెంపుచేయు సాధనమే విద్య. కలకలలాడు మనస్సే కలకలలాడు శరీరమును ప్రసాదించును. మనస్సుద్వారా చేసినకర్మయే మనః స్ఫూర్తిగచేయు కర్మయే కర్మయనబడుచున్నది. మనస్సులేకుండ యంత్రవతుగ జరుపుకర్మ దర్వీక్రియ

4

వంటిది. నిర్గంధ కుసుమమువంటిది. గాడిదబరువు మోతవంటిది. దానివలన జీవితానంద మెట్లు చేకూరగలదు.

ఈమనస్సే పవిత్రమైనపుడు పరిపక్వమైనపుడు సంకల్పింపని స్థితికిచేరినపుడు మాలిన్యమంతయు క్షాళనమైనపుడు ఆత్మస్థితిని పొందుచున్నది. అనగామనస్సు ఆత్మయొక్కయుపభ్రంశము అడుగుమెట్టు మొదటిమెట్టు కాయిపండునరకు పుల్లదనము వగరు చేదు చప్పదనము నున నన మొదలగు వివిధవిరసరుచు లుత్పన్నములగుచున్నవి. పూర్తిగ లెస్సగ పండినపండుమధురసమునే ప్రసాదించును. అప్పు డితరరసములు దరిచేర నేచేరవు. కాయపండై తియ్యబడినపుడే ధన్యత చెందుచున్నది. పీపలు పుల్లకాయలు వగరుకాయలు చేదుకాయలు కొరికివార వేయబడుచున్న వేకాని ఆదరింపబడుటలేదు. వానినివి త్తనములుకట్టుట కుపయోగింపరు. అవియందుకు పనికిరావు. మనస్సుఆత్మయను ఫలమునుండియే పుట్టెను. తిరిగియది యాత్మయే కావలెను. అంతవరకది వివిధావస్థలను పొందుచునేయుండును. అదియాత్మయగువఱకుతన మొదటి నెలవు చేరుకొనువరకు విక్యనుపొందుచుండవలెను. ఆకసమునుండి బయలుదేరిన వర్ష బిందువు సముద్రమును చేరినపుడే ప్రయాణమాగిపోవుచున్నది. మనస్సు ఆత్మయగువరకు పొందువిద్యయే యుత్తమ విద్య. జీవితధన్యతను జీవితానందమును ప్రసాదించువిద్య.

ఇప్పటి విద్యావిధానమో! అది నిప్పచ్చరము. 'లేనిబావ కంటె గ్రుడ్డిబావ మేలు' అను యుక్తి తప్ప ప్రస్తుత విద్యా

విధానములోనున్న విశేష మేమియు లేదు. జీవిత యుత్కృష్ట తతో దాని కంతగా పని లేదు. అది యూపని పెట్టుకొనలేదు. "మనము నిముసముల మీదనే సమస్తము జరిగిపోవలెనను వాయువిమాన యుగములో నున్నాము. అంతయు తొందర, గజిబిజి. కొంతమంది ప్రబుద్ధులు గ్రుడ్డు యింకను కూయదేమి యని యడుగుచున్నారు. యూనివర్సిటీలు, కాలేజీలు, ప్రొఫె సర్లు మనల నెచ్చటకు గొంపోవునదియు తెలియని కుఱుచలైన పాఠ్యక్రమములు" "ఈయుగ లక్షణములు" అని ఒ. యస్. మార్డెను అమెరికను విశ్వవిద్యాలయములను గురించి విమర్శించి నాడు. ఇక వాటి బీదనకలులైన మన కాలేజీలను గురించి చెప్పవలసిన దేముండును ? స్వాతంత్ర వాయువుల ననుభవించు చున్న దేశములలోనే విశ్వవిద్యాలయముల కిట్టి 'యోగ్యత' యున్నవు డిక మన కొక్కిరాయలవిషయమై త్రవ్వనేల ? మిడి మిడి జ్ఞానము లేనియహంకారమును దుఃఖమును తెచ్చిపెట్టును. పుస్తకములను బట్టీపట్టుట, విషయములను ముక్కున పెట్టు కొనుట పాతచరిత్రను తప్పుడు తేడకలతో గూడిన కథలను గ్రుడ్డిగ వప్పజెప్పుట డిగ్రీలకొరకెట్టివ్రాతలనైనను దిగమింగుట గ్రామఫోను వలె రెండట్టలకు మధ్య నింపబడిన విషయము లనే వమనము చేయుచుండుట-విద్యగా పరిగణింపబడుచున్నది. జీవిత ధనమును చూరగొనుట కీవిద్యకు నెచ్చటను సంబంధము కాన్పించదు. పెద్దడిగ్రీలవా రెందరో పెద్దజీతములను గడించు యంత్రములు కాగలిగినను వాటిని విడిచి జీవిత రంగములోనికి

వచ్చు నరికి పేలవజీవు లగుటను మనము కండ్లార చూచు చున్నాము. జీవిత విధానమునకు, జీవిత పరమావధికి దూర మైన చదువొక చదువా? నీయంతశ్శక్తులను పైకి తెచ్చునదే విద్య. మలినమైన మనస్సును, దుర్బల మనస్సును, ఎదిగీ యెదుగుచున్న మనస్సును, కోశావస్థలోనున్న మనస్సును వికసింపచేసి ఫలవంత మొనరించునదియే విద్య. లోపలనున్న దానిని రాణింప చేయునదే విద్య.

మనశ్శక్తికి మానవాభివృద్ధికి యంతులేదు.

"ఒక జీవితములో మానవు డెంతవర కభివృద్ధి చెందగలడో యెవరును చెప్పజాలరు. మానవు డింతవరకే చేయగలడు. అత డింతకుమించి చేయజాలడని చెప్పుటకు హేతు వేదియు కానరాదు. పరిస్థితు లతనిని యద్భుతముగ త్వరితము చేయ గలవు" అని యార్యులు చెప్పిరి.

మనశ్శక్తిని గ్రహించి దాని పారమును చేరుటకే మానవు డుద్దేశింపబడినాడు. మనస్సే మానవుడు. అది లేనిచోట మానవత్వము నశించుచున్నది. అది లేనిదే మానవత్వమే పుట్టుటలేదు. ఇతర ధనములతో పాటు మానసిక ధనమును కూడ కూడబెట్టుకొనిన వాడే ధన్యుడగుచున్నాడు. మానసిక ధనములేని ధనము యింధనము. మానసిక వికాసము నెరుగని పెరుగుదల జంతులక్షణము. జీవితానందము ననుభవించుట

కితర ధనము లుండుగాక నుండకపోవుగాక. నిర్మలాంతఃకరణ విశాలాంతః కరణ, యుదారాంతః కరణ, మధురసమును చిప్పిలు అంతఃకరణము నున్న చాలును. ఇది తక్కిన జీవితము నంతను నమృతమయము చేయగలదు. ఆర్థికాభివృద్ధికి, శరీరాభివృద్ధికి నంతమాకలదు. హద్దుకలదు. వాటి కొక యంతము, హద్దు వుండితీరవలెను. కాని మానసికాభివృద్ధి కంతములేదు. అది యాత్మగ మారిపోవుటయే దాని పరమావధి. ఆనందమే దాని లయస్థానము.

---



ఆశ్చర్యము! ఆశ్చర్యము! ఆశ్చర్యములలో నాశ్చర్యము కాదా!

మేమింటి కేయొక్కడును తాను వృద్ధిపొందవలసినంతగా వృద్ధిపొందుటలేదు. తనయవకాశములు, తనకాలము తన శక్తిలో నేకొద్దిభాగమో మానవుడు తనకై వినియోగించుకొనుచున్నాడు. తక్కినదంతయు గంగార్పణమగుచున్నది; లేదా పరుల దోషములను వెదకుట కుపయోగించుచున్నాడు. ఇది కేవలము ఆత్మవంచన.

ఒక విధమగు 'ఆత్మహత్య' ఆత్మహత్యకు శిక్ష కలదు. కాని యీ 'యాత్మహత్య' ను గుర్తించుటలేము.

దీని నాపుచేసి కొనగలవారే ధన్యులు. అమరులు నగుచున్నారు.



# రోగములు స్వార్జితములు



ఈ శీర్షిక కొంతమంది కాశ్చర్యముగ తోచవచ్చును. ఎవ డైనను బుద్ధిపూర్వకముగ రోగములను వరించునా? వానిని కోరికోని తెచ్చుకొనునా? అంతటి వెర్రులుందురా? ఇది కేవలము అతిశయోక్తి. నమ్మరానిది.

ఈ విషయము పైకిట్లే కాన్పించును. కాని లోతుగా చూచినయెడల నూటికి ఎనభై రోగములు ఇట్టివే యనుటకెట్టి సందేహము లేదు. రోగములన్నియు మనపైన మనము వేసి కొనుననియే కాని యవి సహజములు కావు. లేనిపోని దురభ్యాసములవలన శారీరిక మానసిక పరిశ్రమ లేకపోవుట వలన తీరికగ కూర్చుని యూహించుకొనుటవలన సోమరి తనము వలన మనప్రకృతి కెదురేగుట వలన తలుపు తెరచి యున్నపుడు కుక్క జొరబడునట్లు జొరబడునదియే రోగము లని విశదము కాగలదు. ఈ యతిథులను మనమే యాహ్వా నించుచున్నాము.

మనకందరకు తెలిసిన యొక కథ కలదు. వివాహ మగుట తోడనే యాకాసము వంక జూపి పెండ్లికుమారుని పిలిచి "అదిగో నాయనా అరుంధతిని చూడుము. అది కన్పించుచున్నదా?" యని పురోహితు లడుగుచుందురు. ఒక వరుడు "అరుంధతి

కన్పించుటలేదు. కాని యెూరువందల యప్పు కాన్పించుచున్నది.” అని యనెను. పాప మా యప్పుబాధ లేనిచో నతని కాయరుంధతి కాన్పించెడిదే. అరుంధతి యచ్చటనే యున్నది. ఇతరుల కందరకు కన్పించుచునే యున్నది. అయినను తెచ్చిపెట్టుకున్న యప్పుజాడ్యము మూలమున నతనికది కన్పించుటలేదు. ఋణవ్యాధి యతని మనస్సును హరించెను. ఋణవ్యాధి వంటిదే మనోవ్యాధి. మనోవ్యాధికి మందు లేదందురు. ఆధియే వ్యాధి యగుచున్నది. ఆధియనగా మానసిక విపర్యయము. మనసు కుదురులేకపోవుట. మానసిక స్వాస్థ్యమే శరీర స్వాస్థ్యము.

ఈ మానవయంత్ర నిర్మాణము మానవతత్త్వ రచన మానవ పరిణామము మానవాకారము మానవపరమావధి సిద్ధప్టమైనవి. రోగరహితమైనవి. జీవితములో అరుంధతి వంటి జ్యోతియే కలదు. కాని జడమతి యగుమానవు డనేక వికారములను వెర్రులను కుసంస్కారములను నిజాభివృద్ధి నని కట్టు యుపచారములను తానే తెచ్చిపెట్టుకొనుచు తనమూల స్థితిని మరుగు పరచుకొనుచున్నాడు. అనామయమును వీడి ఆమయమును అనగారోగమును తెచ్చి పెట్టుకొనుచున్నాడు. శరీర మానసిక వికారములకు గురియగుచున్నాడు.

ఒక సింగపుకొదమ పసితనముననే పుట్టినవెంటనే మేకల మందలో పడిపోయి వాని సహవాసముచేత తనపుట్టుకనే

విస్మరించి జీవించుచుండెను. కొంతకాలమున కకస్మాత్తుగ నొక మృగరాజు మూమందలో ప్రవేశించి గర్జింప నారంభించెను. అప్పుడా సింగపుకూనకు తెలివితెచ్చుకొని తన నిజశక్తిని గుర్తించెను. నేటి మానవునిస్థితి కూడ నిట్లేయున్నది. నేటి మానవునకు ఈ యిరువదియవ శతాబ్దపు నాగరిక మానవునకు బాహ్య శరీర జ్ఞానము దానియొద్దుపొడుగు తూకము రంగు యిత్యాదుల మధ్యనున్న చవక బేరపు విజ్ఞానము తప్ప తక్కిన దంతయు శూన్యము.

ఈ శరీరము లోపలనున్న యారోగ్యదేవతను గుర్తింపక నీ శరీరయావరణలో నేకొద్దితలనొప్పి బద్ధకము కడుపు పీకుట పడిసెము లేక యేచిన్నవికారమో కలిగినను వెంటనే లేచి వెన్నువిరచి రొమ్ముపూరించి దానిని మొట్ట మొదటనే త్రుంచివేయక వినువారున్నకొలది చిలువలు పలవలు తొడిగి పెంచి పెద్దచేసికొందురు. రోగమును తెచ్చుకొను స్వభావమును స్వాస్థ్యమును పోగొట్టుకొను నిర్వీర్యత రెండును కృత్రిమములే.

తమకేదియో బాధలు కలవని తామే నిర్ణయించుకొని వానిని వివిధ ఘుటికలతోను వనస్పతులతోను, రహస్యౌషధములతోను మాన్పజూతురు. ఇట్టివారు తమకుతామే జాలి చెందుచు ఇతరులు తమపై జాలిచెంద వలెననికోరుచు, నున్ను రనుచునాపసోపములు నొందుచు నీయమాయక చర్యలో

మొదట సూచనలు మొలకలుగనున్న రోగములను పర్యాప్త ప్రమాణము చేసికొని పురుషకారము చూపజాలని నిస్సహాయులుగ తయారగుచుందురు. ఎత్తినసీసాలను దింపకుండ డాక్టర్ల చుట్టు కైవారము సేయుచుండు మానవులు నాగరికుల క్రింద చెలామణి యగుట ప్రస్తుత యుగలక్షణము.

మానవుడు సహజముగ నలసజీవి యని ప్రతీతికలదు. సాధారణముగ మనము సోమరితనమే సుఖమనుకొని దానినే వాంఛింతుము. మరియు నలసితిమని సొలసితిమని యనుకొని పర్యంకములమీద సోలిపొరలాడు నాచారము యువకు లలవాటు చేసికొనుట పరిపాటియైనది. నూటికి ముప్పాతికవంతులు వ్యాధి చిన్నతనము నుండివచ్చిన గారాబము యొక్క ఫలితమే. చిన్ననాటి పెంపుదలయే పెద్దనాటి పెద్దరోగ మగుచున్నది. అన్ని రోగములకు పునాదు లిచ్చటనే వేయబడుచున్నవి.

ఒక్కడే కుమారుడని పుట్టకపుట్టక పుట్టినాడని ముద్దుల మనుమడని తల్లిచూపు పిల్లడని మూడుకుటుంబముల కొక్కడే యని బాల్యమునుండియు తగుశిక్ష యొసంగక పాడుచేయువా రెందరో కలరు. పనిచేయక పోవుటయే గొప్ప యనుభ్రమ శోచనీయము.

బాల్యావస్థ యతిప్రధానమైనది. నూరేండ్ల పంట కిచ్చటనే సరియైన దోహదము జరుగవలెను. సమస్తావయవములను లొంగదీయుట కిదియే యదను. పచ్చికుండమీద చిత్రించిన

దంతయు నెట్టిసంస్కారము నైనను సహించి మరింత ప్రస్ఫుట మగుచున్నది. బాల్యసంస్కారము 'జీవితము' అను ఆవలో నిగ్గుదేరును. ఇచట నెట్టిసంస్కారము నెరుగనివాడు ఏనాటికి పనికిరాని ఇటుకము [illegible]వలె సుందరచేతను నెట్టివేయ బడు చుండును.

పశుపక్ష్యాదులు తెల్లవారినది మొదలు నిద్రించువరకు నెట్టిచింత లేకుండ పని చేయుచునే యుండును. మాంద్యము నిరుత్సాహము బద్ధకము శోకించకపోవుట పనిచేయవలెనని యుండకపోవుట ఇత్యాది [illegible] మానవస్వార్జితములు. గొప్పగొప్ప వైద్యులు సన్యాసులు గాయకులు వేత్తలు నటకులు మొదలగు వారు రోగములకు తావిత్తురా! సోమరితలంపులకు రోగమునకు చోటిచ్చునంతటి తీరుబడి వారికుండదు. వీరికాల మతి విలువగ్గమైనది. చేతినిండ వృత్తి కల్పించుకొనని వాని బుర్రనిండ నెన్ని మోదుళ్ళింతలు దుర్మార్గము సోమరితనము ప్రవేశించును.

యుద్ధపటాలములోనున్న సోల్జరు ఏనిమిషమునందైన నెట్టి యాజ్ఞలనైన నెరవేర్చుటకు సిద్ధముగా నుండవలెనే గాని బద్ధకముగనున్నదని పనిచేయ నిచ్చపుట్టుటలేదని చెప్పుటకు వీలా? ఏ సేనానాయకుడైన నట్టివారితో పనిచేయగలడా? యోధుడు పిలువగనే యుద్ధరంగమున కురుకవలెను. లేదా తన పనికి స్వస్తి చెప్పుకొనవలెను.

ఈ ప్రపంచ మొక యుద్ధరంగము వంటిది. జీవిత మొక సమరాంగణము. ఇచ్చట నెవరును మరి యుండుటకు వీలు లేదు. పరమావధి జేరువరకు మన మెల్లప్పుడు నిరంతర సత్సాహము జరుపుచుండ వలెనని మన సేనానాయకుని యాశతి. శ్రీకృష్ణు డర్జునునకు చేసిన బోధ యిట్టిదే. కర్మ చేయనివాని కిహములేదు పరములేదు.

చాలమంది రోగమును గూర్చి యూహించుకొనుచు దానిని తామే యాహ్వానింతురు. ప్రసిద్ధివహించిన యొక మానస తత్త్వవేత్త యీక్రింది యుదంతమును చెప్పెను. "ఒకనాడొక వింతమానవుడు తనకడుపులో నెచ్చటనో పుండు కలదని తానే నిశ్చయించుకొని యొక యాస్పత్రికి బోయి పరీక్ష చేయించుకొనెను. ఎక్సురే పరిశోధన గావింపబడెను. ఎచ్చటను వ్యాధిచిహ్నములు కాన్పించలేదు. కాని యతని మనస్సులో మాత్ర మాభావము పోలేదు. ఆరునెల లైనతర్వాత నతడు మరల పరీక్ష చేయించుకొనెను. అప్పుడు కూడ నేరోగము కనుపించలేదు. మరికొంత కాల మైనతర్వాత మరల పరీక్ష చేయించుకొనగా నిజమైన పుండు కాన్పించెను. రెండేండ్లు మనసులో పెరిగిన పుండు చివరకు స్థూలరూపము దాల్చెను. రోగములిట్లే పెరుగుచుండును.

కాస్త కాళ్లు నీళ్ళలోతడిసినను, శరీరమునకు గాలిసోకినను కొంచె మెండదెబ్బ తగిలినను నిక చెప్పవలసిన దేమున్నది!

రొంప! ఇన్ఫ్లూయంజా గుండెదడ వాడిపోవుట మొదలగు వికారములు వారి కండ్లకు కాన్పించుచు చివర కవి వారి నావహించును. రోగములను వారే యాకర్షించుచున్నారు. కొంచెము దగ్గువచ్చుచో ఇది కుటుంబ జాడ్యమేమో! క్షయ యేమో! మాతాతలు తండ్రులు దీనికి గురైరేమో?" యను చింతలు బయలుదేరి యెట్టిరోగమునైన నెదుర్కొనగల వారు తమమనశ్శక్తిని నష్టముచేసికొని చివరకు రోగగ్రస్తు లగు చున్నారు. "మనస్సే ఘనీభవించి కార్యముగ మారును. వస్తురూపమును బూనును."

అన్నిపరిస్థితులలోను మనకు మనమే యజమానులము. మన శరీర మానసిక గతులు మనము చెప్పినట్లు నడువవలసినదే గుని గట్టినమ్మక మున్నవారిని సామాన్యముగ మానవుల నావహించు ననేకజాడ్యములు తేరిపారి చూడవు. మనము భావించు భావముతే మన జీవితములో ప్రతిఫలించును. రోగ భావములు రోగములను సుఖశాంతి భావములు సుఖశాంతు లను ప్రసాదించును.

ఒక స్నేహితుడు గలడు. అత డెన్నడు తనచేయి వైద్యునకు చూపి యెరుగనని సగర్వముగ చెప్పుచుండెడివాడు. నీవుగూడ నిట్టిగాములో నేలచేరరాదు? మనరోగములు కేవలము జ్ఞానము చేతనే కలుగుటలేదు. ఎట్లు నడువవలెనో ఎట్లు తిన వలెనో ఏమి తినవలెనో ఎట్లు విహరింపవలెనో తెలిసియు

మానవుడు 'శరీర మాత్రకంటె బలహీనమైన దగుటచే విషయ ములచే పీడ్వబడుచు తికముక జెందుచున్నాడు. నీ వెల్లపుడు మహదాశయములు మహత్కార్యములు నీనుండి బయల్వెడల వలెనని కాంక్షించుచు నున్నతస్థాయిలోనుండి తల కడుపు నాడి జిహ్వ — ఇత్యాది యవయవముల ప్రభావముల సంగీకరింప నిరాకరించుచో నీవికారములు నిన్ను లొంగదీయజాలవు. దీనిని దరిజేరనీయకుండుట కొక సులభమైన యుపాయము గలదు. అలసత నైరాశ్యము దుర్బలత తోచకుండుట పొడగట్టునేని వెంటనే వాని వ్యతిరేకభావములను తీవ్రముగ జపింపవలెను. ఉత్సాహము ధైర్యము పౌరుషము ఆత్మశక్తి విజృంభించుచో నీ నీచభావములు పలాయన మగును. ఓటమి నెన్నడు నంగీక రింపకుము.

కొందరు నిష్ఫచ్చర కబుర్లు వోటుపలుకులు పల్కు చుందురు. తిండిపుష్టి తగ్గకపోయినను నిద్ర కెట్టిలోపము లేక పోయినను చలాపులకు రోగములేనట్లున్నను నూటయేబది పౌనులు తూగుచున్నను "ఎట్లున్నావు" అందుమా, "అబ్బే! ఏమీ బాగుండలేదండి ఏదో ఉందిలెండి. రోజులు గెంటు చున్నాను. ఒకరోజుదా ఏమిటి?" యను హీనవాక్యములు బల్కుచు తమరోగ వివరములగురించి యొక చాటభారతము విప్పుదురు. ఇవన్నియు జరుగుబాటు రోగములు "జరుగు బాటుంటే రోగముకంటె సౌఖ్యములేదు." అను సామెత యిందుకే పుట్టెను. పశుపక్ష్యాదులలో రోగములు లేవే?

ప్రకృతిధర్మముల నవి పీడకపోవుటయే దీనికి కారణము. కొందరికి తమ్ముగురించి పై వారు శ్రద్ధబూనవలె నని తమచుట్టు మూగ వలెనని కోరికయుండును. కాని యితరుల నాకర్షించుశక్తి ఘనత తమయందేమియు లేకపోవుటచే వీరేదోయొక వ్యాధి నటింతురు. ఒక యమెరికా యధ్యక్షునిభార్య ఇట్లేచేసి యతనిని రాచకార్యములు చూచుకొనకుండ వేధించెడిదట, "నీకు నామ రూపములు నొకస్థానము యేర్పడవలెననిన నీవితర చెడు తలంపుల నెట్లెదురుకొందువో యట్లే సోమరితనము సోఫాలమీద కూలబడుట శరీరమును గారాబముచేయుట మొదలగు దురాచారములను దూరము చేయవలెను." అని మార్డెన్ వచించెను.

నిద్రించునపుడుతప్ప సోఫాలమీద పర్యంకములమీద దొర్లుట పురుషలక్షణముగాదు. నీకిష్టమున్నను లేకున్నను నీపురుషధర్మముల నెరవేర్చుటకు నీశరీరమును వంచుము. సాగదీయుము. లొంగదీయుము. చెమట బిందువుల నుండియే జీవితము ధన్యమగుచున్నది. శరీరమును దాచుకొనువాడు మృతి జెందినవాడే. దొంగ యింట ప్రవేశించిన మనమేమిచేయుచున్నాము? వెంటనే తరిమివేయుచున్నాము. అట్లే నీవీ సర్వ వికారములను తరిమివేయవలెను. ఇవి నీమిత్రగణము లోనివి గావు. ఇవి నీ శత్రుకోటి. సోమరికి శరీర మానసికారోగ్యము పటుత్వము యెచ్చటనుండివచ్చును? నీకొరకింకొకరు నీపనులను చేసిపెట్టెదు రనుకొనుట భ్రమ. లెమ్ము! పరిస్థితుల నెదుర్కొమ్ము! నీ వెంతకాలము శరీరమానసిక నీరసాకారములను

ధరించుచో యంత కాలము నీకు విజయము చాలికి. ఆత్మవిశ్వాసము లేనివాని కాయురారోగ్యములు శూన్యమగును. పోయిన ధనమును తిరిగియార్జించుకొనవచ్చును. మిత్రులను బంధువులను ఎప్పటికప్పుడు చేకూర్చుకొనుచుండవచ్చును. కాని నేటిదినము తిరిగి రాజాలదు.'' యనువివేకముతో ప్రతిదినము నీవు గడుపుదు వేని నీకెట్టిమందులు విశ్రాంతిమందిరములు నవసరముండవు. రణరంగములో వెనుకచూ పేమాత్రము కన్పించినను శత్రువు మీద పడుచున్నాడు. నీబుద్ధి నీసంకల్పము యేమాత్రము జంకినను దుర్బలత్వ మేర్పడుచున్నది.

"సాంప్రదాయము, పరిసరములు నెంత యనుకూలముగ నున్నను మానవుని దుర్బలత్వమునకు దుఃఖమునకు నిర్వీర్యనీరస భావముల నలవరచుకొనుటయే మూలకారణము. సత్యసంపద గల భావమలవర్చుకొని సాంప్రదాయకమైనట్టియు పరిసరములకు సంబంధించినట్టియు తదితరములును నగుదుర్బలతలను వ్యాధులను తృణీకరించి దుఃఖములను పరాజయములను పారద్రోలి విజయమును గౌరవమును ఆనందమును ననుభవింపగల్గినవారి సాక్ష్యముచే నీవిషయము రుజువు చేయబడెను.'' వివేకానంద రామతీర్థ మహాత్మ శంకర బుద్ధాది సత్యసంపన్నులు తమ మహాత్కార్య దీక్షలో రోగములను దరిజేరనిచ్చిరా? శాగ్యనిమగ్నత వ్యాధులకు పరమౌషధము; సర్వరోగవేసు వంటిది. వివిధనాగరికతలను సభ్యతలను సంస్కృతులను పెంపొందజేసిన

ఋషిసత్త్వములు వికారములకు తావిచ్చి తమకార్యదీక్షను సడలించినచో నేడీప్రపంచ మెట్టిస్థితిలో నుండెడిది?

మనోవ్యాధియే వ్యాధి. మనస్సుతోనే వ్యాధి వికారము ప్రారంభమగును. రోజు కనేక రోగులకు చికిత్సచేయు నొక డాక్టరుండెను. ఒకనాడితడేదోరుగ్మతకు బాల్పడెను. అతడు దానిని నిర్ణయింపలేక నల్గురు డాక్టర్లచే పరీక్షచేయించుకొనెను. వారిలో నొక డీయనకు రక్తపుపోటు కలదని చెప్పెను. రోగ మేదో తెలియని యీడాక్టరు కామాట వినిపించగనే బుర్ర తిరుగుట ప్రారంభించెను. రక్తపుపోటు అనకముసుపు లేని బుర్ర తిరుగుడు ఆభావము కలుగగనే ప్రారంభమాయెను.

కనుక మనరోగములు చాలవరకు నిట్టివే. అవి మానసికముగనే ప్రారంభించును. తల్లిదండ్రుల యవివేకము వారిప్రవర్తన కొన్ని రోగములను తెచ్చును. కనుకనే యొకనియారోగ్య భాగ్యమునకు తల్లిదండ్రులపై నెంతయో బాధ్యతకలదు. తల్లిదండ్రు లిచ్చుయారోగ్య భాగ్యమును పెంపుచేసికొనుశక్తి ప్రతివానిలోను కలదు. రోగమును తెచ్చునది మనస్సే; దానిని వారింప గలదియు మనస్సే.

---





ఈ ప్రపంచములో దైవము సృష్టించు జాతులు రెండే కలవు. ఒక జాతి యుపకారులు. రెండవ జాతి అపకారులు. ఒకరు ప్రపంచ మిత్రులు. రెండవవారు ప్రపంచ శత్రువులు.

ఇవిగాక మిగిలినమత జాతులు రంగుజాతులు మానవ కల్పితములు. అజ్ఞానముచే, స్వార్థముచే, సోమరితనముచే నంగీకరింపబడిన జాతులు.

ఇవి దేహాభిమానజనిత జాతులు. దంభాహంకార మూలములుగల అసంస్కృత జాతులు. దైవము శ్లాఘింపని మృషా జాతులు.







# శీలము

తే॥గీ॥ సత్కులంబున బుట్టుట సకలవేద
ములు బురాణంబులును శాస్త్రములును జదువు
టయును సద్గతిజేర్చు సాధనములుగావు
శీలసామగ్రిలేని దుశ్చేష్టితునకు. (భారతము)

శీలము పదారువన్నె బంగారము వంటిది. అది ఏ దేశములో నైనను మారును. ఇది దొంగనాణెము వంటిదికాదు. దీనికి మారకముతో నిమిత్తములేదు. జాతి మత కుల వివక్షతలతో పనిలేదు. దీనిని దేశకాలములు బాధించవు. పంచభూతముల ప్రభావము దీనియందు పనికిరాదు. ఈ రోజులలోని "యుబ్బునాణెము" వలె దీని కెన్నడు నుత్పతన యధఃపతనములుండవు. ఏ దేశములో పుట్టినను శీలసంపదగలవారి జీవితము లెల్లప్పుడును మానవకోటి కలంకారముగనే యుండును. ఆదర్శప్రాయముగనే యుండును. పుబ్బలో పుట్టి మఖలో మాయమగునట్లు నేటి యైశ్వర్యములు, పదవులు, సామ్రాజ్యములు మనము చూచుచుండగనే నాశములగుచున్నవి. కాని శీలసామ్రాజ్యమెన్నటికి నారిపోవునది కాదు. కొద్దికాలము తలయెత్తి నశించిన సామ్రాజ్యముల నేడొక్కడును తలంపడు. తలంచినను నవి తద్దినముల లెక్కవలెనుండును. కాని బుద్ధుడు, కృష్ణుడు, మహమ్మదు జీసస, యిత్యాది ఋషిపుంగవుల జీవితము

లను విస్మరించుచో నాగరికతయే నశించును. ప్రపంచ మంధకార బంధురమగును.

శీలమే మానవుడు. శీలములేక తక్కినయుపాంగము లెన్ని యున్నను నిరుపయోగములని పై పద్యము చాటుచున్నది. శీలము యొక్క విలువ యమూల్యమైనది. శీలబలమే బలము.

శీలములేని బలము పశుబలము "అతియెత్తైన పర్వతాగ్రమునుండి పడి భిన్నాంగు డగుటమేలు; సర్పరాజునోట చేయి పెట్టుటమంచిది; ప్రజ్వలితాగ్ని గుండమునబడుట యోగ్యము; కాని చక్కని శీల గుణమును వర్జించుట యోగ్యము కాదు" అని భర్తృహారి సుభాషితము గలదు.

మన మాస్తిపాస్తులను భార్యాబిడ్డలను వస్తు వాహానములను పదవులను, హోదాను చివరకు ప్రాణములను విడువవచ్చును. మనము వీడవచు ననుటయే యేల; అవియే మనలను విడిచి పెట్టుచున్నవి. "చచ్చి భూమిమీద పడి యుండు వాని శరీరము నొక కట్టెవలె మట్టిపై ఎలె చూచి బాంధవు లందరు విముఖులై వెడలిపోదురు. ధర్మమొకటియే యతని ననుసరించును" అని మనుస్మృతి చెప్పుచున్నది. ధర్మరాజును తన కూర్మి తమ్ములందరు వీడిరి. అనుముద్దరాలు సత్యభామకు బుద్ధులుగఱపిన ద్రౌపదికూడ విడిచిపెట్టెను. అతి విశ్వాసురాలగు నొక కుక్కమాత్ర మతనిని విడిచిపెట్టలేదు. ధర్మదేవతయే యాకుక్క. కనుక శీలము, ధర్మగుణము—ఇది

యొక్కటియే తాను. అసది కాని తక్కిన వేవియు తనతో నుండునవి కావనియు విశదమైనది. అట్టిశీలమును విడువకూడదని చెప్పుటలో నాశ్చర్యమేమున్నది.

ఒక శాస్త్రికలడు. సుప్రసిద్ధకుటుంబములో పుట్టి చిన్న తనముననే కాశి కేగి యనేకవిద్యలునేర్చి తిరిగి స్వదేశము వచ్చి పెద్దపండితుడని యాయన పేరుపొందెను. అనర్గళమైన కవిత్వము, జ్యోతిషము, బహుపురాణ పాండితి, చక్కని వాక్పటిమ కలవాడు. సిరిసంపదలకుగూడ లోటులేదు. కాని యిన్నియుండియు నాయనకు గుణ మొక్కటియే కొరత యయ్యెను. నోటినిండ మాటలున్నవి. బుర్రనిండ శాస్త్రము లున్నవి. మేధయన్నింటిని మరపించును. కాని యాచరణ, జీవితము పెడత్రోవ పట్టెను "మాటలు భూపుత్రికలు చేతలు స్వర్గభవ కుమారగణము" అని జాన్సన్ కవి వచించెను. ఈ పండితుని చేత లీరెండుగణములకు గాక మరియొక గణము నకు జెందెను.

ఈయన గతించి యర్ధశతాబ్దమయ్యెను. ఈయన దాష్ట్య మిప్పటికి చెప్పుకొనబడుచున్నది. "ఏదోయొక గొప్ప ప్రయోజనముకై వినియోగ పడజాలని శుష్కజ్ఞానమున కెట్టివిలువ యునుండ జాలదు. కళాశాల డిగ్రీలకెక్కువ విలువలేకుండుట కిదియొక కారణము. అట్టిడిగ్రీలు చిల్లరజ్ఞానమును మాత్రమే సూచించును" జీవిత మనుభవమయముగాని గ్రంథమయము,

శబ్దమయముగా ... అనుభవము ... కుక్కచర్మములో పోసిన పాలవలెనుండును.

ప్రవర్తన మంచిదికాని వానిని విశ్వసించువారెవరు? అట్టి వారితో భార్య బిడ్డలు, యితర బంధువులు, లోకము యెట్లు సహజ సహకారమును జూపగలదు. నెత్తిమీద మణియున్నను కోరలయందు విషమున్న సర్పమునెవ్వరు జేరుదురు? ప్రవర్తన చెడుట యనగా నంతయు చెడుటయేగదా? అట్టివాని జీవితమే దారి తప్పిపోవును.

ప్రవర్తన యనేక ముఖములుగ నుండును. ఇది గోముఖముని గారితప్పుట ప్రారంభించినను సర్వత్రా ప్రాకి సమగ్రనాశనమే సంభవించును. "నిజాయితీ, సత్యసంధత, న్యాయము, నీతి, యాత్మగౌరవము—యీ యన్నిటిని వీడకుము." అని యొక తండ్రి తన కుమారుని కుద్బోధించెను. ఇతరములను పోగొట్టుకొనినను పోగొట్టుకొన వచ్చును. కాని వీనిని పోగొట్టుకొనినచో ప్రాణమే పోవును. గొల్లపిల్లవాడు, తండ్రి కథ మనమెరిగినదే! పరిహాసమున కబద్ధమాడినను నొక్కొక్కప్పుడు ప్రాణసంకట మగుచుండును.

"నీచత్వమునుండి, యల్పమైన బడాయికోరు తనమునుండి, యవినీతి స్వభావమునుండి యసత్యములు పుట్టుచుండును. వాని యుద్దేశ్యము లెన్నడు నెరవేరకపోగా నవి యబద్ధీకుని గర్హింపజేయును. న్యాయము, గౌరవము, మర్యాద, నిక్కమైన భాష లేనిదే నిరంతరాయమైన విజయమెవనికిని నెందులోను కలు

గదు. చిరగౌరవ మేర్పడజాలదు. మనమందర మెప్పుడో యొకప్పుడు పట్టుపడుదుము. నీ నిజశీలము నిశ్చయముగ కనుగొనబడి దానికి న్యాయమైన మెచ్చికోలు కలుగును.” నీ జయాపజయములు నీ శీలముయొక్క ఫలితములే!

ఒక పత్రికలో నీక్రింది యుదంతము చెప్పబడెను. ఒక ప్రయాణీకుడు రైలెక్కి తన సామగ్రిని తన ప్రక్కనున్న స్థలమునిండ పేర్చెను. ఆనాడు రైలు క్రిక్కిరిసియుండెను. ఇంతలో మరియొక పాంథుడు బండిలోనికి వచ్చి యెచ్చట స్థలము కానక యాస్థలములో నెవరైన కలరాయని యడిగెను. “అందులో నొకడు సామగ్రిపెట్టి యిపుడే కాఫీ త్రాగుట కేగెను. ఆయన తిరిగివచ్చును.” అని బండిలో కూర్చొనిన యతడు బదులు చెప్పెను.

ఆ ప్రయాణీకుడిది యసత్యమని గ్రహించి “సరే. ఆయన వచ్చువరకు నేనిచ్చటనే కూర్చొనెదను” అని చెప్పి సామగ్రి యొకవైపు సర్దెను. రెండవవాడు తెల్లమొగమువేసి చూచుచుండెను. నిజమునకు “కాఫీ త్రాగుటకు వెళ్లినవాడు లేనే లేడు” రైలు సాగెను. క్రొత్త స్టేషనువచ్చెను. మొదటివాడు తన సామగ్రిని ప్రోగుచేయుచుండెను.

“క్షమించండి, యివి మీరు ముట్టుకొనుటకు వీలులేదు. వీటి యజమాని యెచ్చటికో వెళ్లినట్లు తామే సెలవిచ్చిరి.

వీటిని కాపాడుట నా ధర్మము." అని యతడనెను. దీనితో నా ప్రయాణీకు డుగ్రుడై తిట్టనారంభించెను. వారి చేతులు కలియు చుండెను. ఈ గడబిడ జూచి స్టేషనుమేష్టు రరుదెంచెను. వా రుభయుల మాటలు విని "నే నీసామాను భద్ర పరచెదను. దీనిని పట్టణాస్టేషనులో నుంచెదను. మరొకరెవరును వీటి కొరకు రానియెడల దీనిని నీకే యిచ్చెద" నని యతడు మొదటి వానితో ననెను. ఈ సమాచారము విని ప్రయాణీకులు నవ్వసాగిరి. మొదటివాడు తన సామానుతీసి కొనకుండగనే పిల్లివలె జారిపోయెను. అత డాడిన యబద్ధమునకు తగిన "శాస్తి" యైన తర్వాత నురునా డాతనికా సామగ్రి యిచ్చివేయబడెను.

ఒకయబద్ధ మంతటితో నాగదు. దానిని దాచిపెట్టుటకు మరికొన్ని యబద్ధములు కల్పింపవలెను. కనుక నొకయబద్ధము రోజురోజుకు కందపిలకలవలెను, యరటిపిలకలవలెను పెరుగుచుండును. సత్యమునుగురించి నొకడిట్లు చెప్పెను. "నేనత్యంత సుందర వజ్రమును జూచితిని. కాని వజ్రపరీక్షకు డొకడు దానిలో నేమూలనో యొక స్వల్పదోషమును కనిపెట్టెను. దానితో దానివిలువ చాలవరకు తగ్గిపోయెను. ఏమాత్రపు టసత్యము చెప్పినను మానవుని శీలములో కొంత లోప మేర్పడుచున్నది. ఇది సుపక్వఫల శోభను నాశనముచేయు క్రుళ్ళుదలను సూచించు చిహ్నము. ఒకసారి యబద్ధమాడ నేర్చినవాడు కారణము లేకయే రెండవసారి యబద్ధమాడుట

తేలిక. శీలము లేక ప్రవర్తన గొప్పశక్తి. చేత కానిలేకపోయి నను శీలవంతుని పరపతి కెన్నడు లోటుండదు. ప్రవర్తన, స్థిర బుద్ధి, కుదురుకలచోట నంత తెలివిలేకపోయినను ప్రమాదము లేదు. ధర్మమును బాహ్యముగ మాటలలో గ్రహించుటకంటె దానిని ఆచరించుటయే మేలు. మన మంచితనమే మంచిరోజును తెచ్చిపెట్టును. "ఊరు మంచిదా, యనిన నోరుమంచిదా" యనుసామెత కలదు. నోరుమంచి దేకాదు, చేతలుకూడ మంచివి గనే యుండవలెను. నైతిక విలువను బట్టియే మనమొక జీవితమును పరిగణింపవలెను. నేనొక స్నేహితుని చూచితిని. ఆయన నిజాయితీ కలవాడని సత్యసంధుడని పేర్గాంచెను. అతని కాస్తియేమియు లేదు. అయినను నేవీధికి పోయినను నతని కెవ్వడైనను డబ్బిచ్చెడివాడు. ఇట్టి పరపతితో నత డెంతయో వ్యాపారము సాగించెను. ప్రవర్తనయే పరపతికాని యదిలేని మిద్దెలు మేడలు పరపతి కాజాలవు.

జీవితములో నిజవిజయముపొందుట కేమి కావలెను? బ్లేకీ యను నత డిట్లు జవాబు చెప్పెను. "దీనికి ధన మక్కరలేదు. అధికార మక్కరలేదు. తెలివితేటలును నంత యవసరముకాదు. కీర్తియు నుండనక్కరలేదు. స్వేచ్ఛయు నవసరములేదు. చివర కారోగ్య మొక్కటి యున్నను చాలదు. దాని కొక్కటియే చాలును. శీలము. స్థిరమైన మంచిబుద్ధియొక్కటియే మనకు నిజమైన రక్షణ నీయగలదు. ఇది లేనినాడు మన కధోగతి తప్పదు.

ఇక మన మెవ్వరియభిప్రాయములను, మెప్పులను యాచింపవలెను? ఔరంగజీబుచక్రవర్తి మరణవాక్యములను మన మిదివరకే వినియుంటిమి. "సుఖమైన యంతఃకరణ మవిరళభోగము వంటిది." అని సెనికా వచించెను. అబద్ధములాడి కూటసాక్ష్యములుచెప్పి యనేకకొంపలుకూల్చి బలవంతులతోజేరి బలహీనులను బాధించి లంచపంచములుపట్టి యన్యాయార్జిత మొనరించి మేడలతోను, కారులతోను, కంఠహారములతోను తులకవచ్చును. కాని యెంతకాలము "కారే రాజులు, రాజ్యముల్ కలుగవే వారేరీ?......" అనునట్లు శాశ్వతముగ నిలుచునవి మన పనులు మనప్రవర్తనగాని యైశ్వర్యముకాదు. ఒక యధికారి వేలు గడించి ఇతరులకు దాచయిచ్చెను. దానిని వారు మ్రింగివేయగా యీమానవుడు బెంగతో చనిపోయినాడు. ఒకడు జనులందరు కాటకముచే బాధపడుచుండగ లక్షలార్జించి దానిని దాచలేక ఆత్మహత్య చేసికొనినాడు.

శీలమే మానవుడంటిమి. శీలమనగానేమి? "ఇతరులేమి చేసిన నీకప్రియముగ నుండునో దానిని నీవారులయెడల నాచరింపకుండుటే పరమధర్మము." అని భారతములో నతిసరళముగ చెప్పబడినది.

శీలముమీాదనే రాజ్యములు నిర్మింపబడెను. అవి శీలముతోనే వృద్ధిచెంది యదినశించుటతోడనే నాశముచెందునని చరిత్ర చాటుచున్నది. మరొకసామ్రాజ్యపతనమును గురించి గిబ్బను

మహాశయుడు వ్రాయుచు దానిపతనమునకు పాలకులనైతిక పతనమే కారణమని ఋజువుచేసెను.

మంత్రు లందరికంటె పిన్నవయస్కుడను పేరుతో నూరే గిన మాజీమంత్రి యొకరు మరిద్దరు మాజీమంత్రులు మంత్రులు కాగోరిన మరి కొందరుగల సభలో శాసనసభ్యులను నిర్ణ యించుపట్లు కొన్ని యర్హతలు, నియమములు పాటింపవలెనని చెప్పగా 'అబ్బో! ఈయన ధర్మమును గురించి నీతులను గురించి మాట్లాడుచున్నాడే' అని నోరు చప్పరించి నిర్భయ ముగ శీలసామగ్రిని ధిక్కరించి యథ్లేసంచరించినాడు. పాపము నేడు ఆయనగారి, ఆసభలో నాడిన పలుకులను ప్రత్యక్షము గను, అప్రత్యక్షముగను సమర్థించినవా రొక్కరుగాని తిరిగి యే గద్దెను అలంకరింప జాలకపోవుట కేవరేమి చెప్పగలరు? గిబ్బను మహాశయుని వాక్యములే యిచ్చట ప్రతిధ్వనించెను. మన పలుకులు, చేష్టలు, భావములు గాలికి పోవునని యీ మాజీ మంత్రి పుంగవుని పిచ్చియూహ.

మానవుడు నిరంతరము వృద్ధిచెందుచుండ వలెనుగాని యొక చోట నాగిపోవుటకు వీలులేదు. ఆగుటయనునది శరీరమునకు గాని మనస్సునకులేదు. అది తనగమ్యమును పొందువరకు ప్రయాణము చేయుచుండును.

"మనమెట్లు భావింతుము? మనకేమి తెలియును? మన విశ్వాసమేమి?" అనునవి యంతగా లెక్కకురావు. మనచేతలు,

మనయాచరణలు మాత్రమే శోధింపబడును. అని రస్కిన్ కవి చెప్పినాడు. విశ్వాసము ఆచరణ, జ్ఞానము ఆచరణ క్షీర నీరములవలె సమ్మిశ్రమైనపుడే యుత్తమ మానవత్వము సిద్ధించును. ఆచరణలేని మత ప్రలాపములు; జ్ఞానసల్లాపములు నిరర్థకములు. అవి ప్రాణహీనమైన కొయ్యగుఱ్ఱములవంటివి.

మ. తమ కార్యంబు బరిత్యజించియు బరార్థప్రాపకుల్ సజ్జనుల్
దమ కార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థ ఘాతుకజనుల్ దైత్యుల్ వృథాన్యార్థభం
గముగావించెడువార లెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్.

మన మందరము నీనాలుగు వర్గములలో నేదో యొకవర్గమునకు చెందవలసిన వారమే.

"మానవజాతిని రెండు తెగలక్రింద విభజింప నచ్చును. ఒక తెగవారు పరోపకారులు. రెండవవారు అపకారులు" అని యెమర్సను కవి వచించెను. వీరినే భగవద్గీత దైవీసంపత్తు కలవారు: ఆ సురీసంపత్తు కలవారునని స్పష్టపరచెను. మొదటి వారు లోకకల్యాణ కరులు. రెండవవారు లోకకంటకులు. "మంచి నడవడియే శ్రేష్ఠమానవ స్వభావము. అది మానవ రూపముదాల్చు నైతిక క్రమము. శీలసంపదగలవారు సంఘమునకు జీవమువంటివారు. ఇంతేకాదు.

వీరు చక్కని పరిపాలనగల ప్రతి ప్రభుత్వమును నడుపగల యుత్తమ శక్తులు, దక్షులు. ఏలనన ముఖ్యముగా నైతికసంపదే ప్రపంచమును పాలింపగలదు" అని స్మైల్సు వచించెను.

శీల మనగా పొడిమాటలుగావు. కేవలభావములును గావు. పుటము పెట్టినపుడే బంగారము పరీక్షింపబడు చున్నది. అట్లే శీలము జీవిత సంగ్రామ పరీక్షకు నిలువవలెను. "పసదనము గల శీలము ప్రాపంచిక దైనిక కృత్యములలోని మోహములో, వివిధ పరీక్షలలో, చలింపక నిలువవలెను. అది జీవితములోని ఢక్కా ముక్కీలకు తాళగల్గియుండవలెను. జీవితముతో నిమిత్తము లేక మతములలో పెరుగు గుణవిశేషము లంత పరిగ ణింప తగినవి కావు." గుణాభివృద్ధికొరకే యీ ప్రపంచరంగ మేర్పడినది.

శీలము, విజయము బాహ్యముగ తాత్కాలికముగ మన లను మోసపుచ్చునవిగ నిజమును మరపించునవిగ నుండిన నుండవచ్చును. బాహ్యమునకు విజయముగ నారోగ్యముగ నానందముగ కనిపించవచ్చును. లోపలయంతయు బోల, రోగము, అంద వికారముగనుండి యెప్పుడో యొకప్పు డగ్ని పర్వతమువలె పగులవచ్చును. మోసమెప్పటికైనను బయట పడకతప్పదు." పద్యము, చిత్రము, నాటకము, ఉపదేశము యీ యన్నింటి వెనుక వీనిని బలపరచు శీల ముండవలయును. అది లేనినా డివియేవియు గడ్డిపరకకైనను పనికిరావు" అను వాక్యములో నెంతయో సత్యముగలదు.

ఒకస్నేహితుడు గలడు. అతడు కలముపట్టినచో తేనెయే వర్షించును. వేదికకెక్కినచో మేఘగంభీరనినదముతే కురియును. అయిననేమి? అతనికి జీవితములో సుఖమేలేదు. కారణము శీలము. అతనికి ప్రపంచమంతయు మోసమయము. అందరు వంచకులు. తన గొప్పను గుర్తింపనివారు కృతఘ్నులు నని యతడనుకొనును. ఇదియంతయు నతని భావనయే. నేను తప్ప నాకెవ్వరు నెట్టి యుపకారము చేయజాలరు. నేనుపొందు యుపకారమును నేనే నానెత్తిమీద వేసికొనుచున్నాను. నా నిజ దోషమువలన గాక నేనెన్నడు నిజమైనబాధ ననుభవించుట లేదు." యనునొక ఋషివాక్యమునకును, పైమిత్రుని యావేదనకును నెంతభేదమున్నదో చూడుడు? ఈ ప్రపంచమొక యద్దాల మేడవంటిది. ఇందుమన మెచ్చటినుండి యెటువైపు చూచినను మన ప్రతిమయే కాన్పించును. దాని కన్యమైన దానిని చూడజాలము. అట్లే మన భావములే, మనశీలమే మనమీద ప్రతిఫలించును.

మన మొకలోయలో నడచుచు కేకవెట్టునపుడు మన మే కేకవేయుదుమో యదియేమనకు వినిపించును. దానికివిరుద్ధమైన కేక వినపడజాలదు. ఈజీవితమను లోయలో నీధ్వనిని నీవే వినుచున్నావు. నీ శీలమే నీకు సర్వత్ర కనిపించును. దానికి తగిన యనుభవమునే నీవనుభవింపగలవు.

సత్యము, మృదుత్వము, హితము, అస్తేయము, పరోపకారము, సహనము, గుణగ్రహణము, విశాలత, గంభీరత,

కార్యదక్షత—ఇవి యన్నియు శీలసామగ్రి. ఇవి గలవారే ప్రపంచమున కాదర్శపాత్రు లగుదురు. ఇవి లేనివా రెన్ని ప్రగల్భములు కొట్టినను, యెన్ని వాగ్దానములు జేసినను, యొంటినిండ నెన్ని చిహ్నములు ధరించినను వినువారుండరు విశ్వసించువా రుండరు. కార్యములను చేసి చూపువారెవరో చేయకుండ కూయువారెవరో ప్రపంచము గ్రహింప గలదు. మనము కొందరిని కొంతకాలము మోసగింపవచ్చును. కాని అందరిని యంతకాలము మోసపుచ్చజాలము. మన యంతఃకరణము నసలే మోసపుచ్చజాలము. కాలమే, నీహృదయమే నీ నిజ స్వభావమును, శీలమును వెల్లడిజేసి నిన్ను బయటబెట్టును. కనుక శీలముతో నుపమింప తగు వస్తువు ఇంకొకటిలేదు.

మహాత్ములకు సామాన్యులకు భేద మెచ్చట గలదు. మొదటివారు శీలవంతులు, ఆడితప్పనివారు, చెప్పినట్లు చేయువారు, చేయునట్లు చెప్పువారు, కష్టమని భయపడని వారు, సుఖమని మితము తప్పనివారు, ఒరునకు, తమకుమధ్య నెట్టి భేదము చూడ జాలనివారు, పరహితమునే గాని యుపకారము గోరనివారు, అకారణముగను నుపకారము చేయువారు, కుడిచేతితో చేసినది యెడిమచేతికైనను తెలియకుండ చేయువారు. తక్కినవారు విపరీతబుద్ధులు, ఆచరణ శూన్యులు ఆచరింపని నోటిసంపదకు విలువలేదు. శీలసంపదయే నిజసంపద. అది లేనిదైయైశ్వర్యము లన్నియు పాముకుబుసముల వంటివి.

---

# కష్టములు

నహిభిక్షుకా స్సంతీతి స్థాల్యో నాధి శ్రీయంతే?
నహిమృగా స్సంతీతి యవా నోప్యంతే?

"కష్టములున్న వని కార్యారంభమును త్యజింతుమా? ముష్టివాండ్రున్నారు గదాయని స్థాల్యన్న పచనమును మానుకొనుచున్నామా? తేళ్ళున్నవిగదా యని ధాన్యాదులను జల్లుట మానుకొందుమా? కష్టమనగానేమి? అది యొక్కొక్క కార్యమును నెరవేర్చుట కవసరమగుపటుత్వమును సూచించు పదము. అది కృషియొక్క యగత్యమును తెలుపు సూచనమాత్రమే! "అది శిశువులకు, నవివేకులకు 'బూచి' వంటిది. పురుషులకు త్తేజకారి" యని యొకకవి వచించెను. కష్టములు కలకాలముండవని చెప్పుచుందురు. శీతోష్ణసుఖదుఃఖములు వచ్చుచు పోవుచుండును. అవి యనిత్యములు వానిని తరింపుము. యని గీత చెప్పుచున్నది. ఒకనా డొకపిల్లవాడు నదియొద్దున బిక్కమొగము వైచికొని దీర్ఘముగ నాలోచించుచుండెను. ఒక పాంథుడా దారిపోవుచు నతని విచారకారణమును ప్రశ్నించెను. "ఈతకొరకు కెమరు చూచుచున్నాను. అది వచ్చిన తరువాత నదినిదాటి పోవచ్చును అనియనుకొనుచున్నాను" యని యతడనెను. అదెచ్చటినుండి వచ్చును? ఒడ్డునకూర్చున్న వాని కీత

మెట్లువచ్చును? కొంచె మించు మించు మనమిట్లే చేయుచుం దుము. "నన్నుపైకిలాగువారు లేరు. నాకు తగిన యవకాశ ములు లేకపోయినవి. నాయిరుగు పొరుగు పరిస్థితులు సుఖ ముగా లేవు. చేతిలోడబ్బులేక పోయినది. నాకే యారోగ్యముగ నుండిన జోడి చేసేవాడినే! అబ్బే! మా ముసలమ్మ నాకన్నింటికీ యడ్డమే! ఏమి చెప్పను? కాలం కర్మం కూడి రాలేదు." అను సాకులను మనమందరము విందుము. వినుటయే కాదు. మనమేచెప్పుచుందుము.

ఒకనవయువకు డొకసారి "నాచేతికొక మోటారు కారు, చాలిన పెట్రోలు యిస్తే లోకాన్నంతా తలక్రిందులుచేసే వాడినే!" అనియనెను. లోకాన్ని తలక్రిందులుచేసేయోధుని కొక్క పెట్రోలు, కారు ఇంకొకరివ్వవలెనట. నిజమున కివి యన్నియు సాకులు. అసమర్థతల చిహ్నములు. దుర్బల లక్షణములు. సోమరితనమునకు దాపులు. కష్టముల నూహించు కొనుటలు. పెంచుకొనుటలు. చివరకు మాటల ప్రోవులు. కష్టములపై కన్నెర్ర జేయువాని కివి యేవియుకానరావు. ముని సిపలులాంతర్ల క్రింద, సంత చావిళ్ళలోను, చెట్లక్రింద, నడివీధులలోను, చీడీలమీదను, చివరకు గుడ్డిపుశాలలలోను చదువుకొని గొప్పవారైనవా రెందరో గలరు. దమ్మిడీ పిత్రార్జితము లేక చిన్నతనమునుండియు తమ్ముతాము పోషించుకొనుచు, తలిదండ్రులను పోషించుచు సగము డొక్కనిండునట్లే తినుచు, మధియములేనిచో నుపవాసము చేయుచు మహామహులైనవా

రెందరో గలరు. షేక్స్పియర్ మహాకవి గుఱ్ఱపుసేలలో పనిచేసెను. అబ్రహామ్‌లింకన్ బంగారపుటుయ్యాలలో నూపబడిన వాడు కాడు. అతడొక యూరుపేరు లేని సామాన్య బాలుడు. అతడుచేపట్టినవన్నియు విఫలమగుచునేవచ్చెను. నలుబదియేండ్లు వచ్చునరకు నతనికి విజయమనునదియేలేదు. కానియతడా విఘ్నములన్నియు విజయసోపానములక్రింద మార్చివేసి చివరకు ప్రపంచములోని యత్కృష్టులలో నొకడు కాగల్గెను. "క్రామ్వెల్" హంటింగ్టన్‌లో నొక సామాన్య వ్యవసాయ కుంటుంబములో పుట్టి యింగ్లండులో నందరికంటెను ఘటనాఘటన సమర్థు డయ్యెను.

వివేకానందుడు చదువుకొనురోజులలో తిండిలేక నుపవసించిన రోజులెన్నియో గలవు. రామతీర్థ రోజుకు మూడు కానులతో గడిపిన రోజులుగలవు. పూర్వఋషులందరు కందమూలములనే తిని, చెట్లక్రిందనే పండుకొని వేలకొలది యేండ్లు గతించినను మరచిపోదగని మహాత్కార్యములను జేసి, మహోత్తర కావ్యములను వ్రాసిరి. ప్లేటోమహాశయుడు చిన్నపెట్టివంటి దానిలో జీవించెడి వాడట. వారములను జేసికొని కష్టించిచదివి పెద్దపదవులనధిష్ఠించినవా రెందరు లేరు?

"భూమినుండి యింతవరకు త్రవ్వబడిన బంగారము కంటె మానవుని మెదడు నుండియే యనేకరెట్లు బంగార ముత్పన్నమయ్యెను" అని యొక కవిచెప్పెను. మానవుని మెదడును

మించిన బంగార మెచ్చట గలదు ? అతని మోసము వలననే సృష్టి బంగారమగుచున్నది. బొగ్గు వజ్రమగుచున్నది. సముద్రము పాయలగుచున్నది. కొండలు బెండులగుచున్నవి. మిన్ను మన్నగుచున్నది. మన్ను మిన్నగుచున్నది. భూతలము స్వర్గతల మగుచున్నది. శరీరము వజ్రకాయ మగుచున్నది. అసాధ్యము సుసాధ్య మగుచున్నది. దూరము దగ్గరగుచున్నది.

కుక్షింభరత్వమున కేర్పరుప బడిన విశ్వవిద్యాలయముల లోను, గుమాస్తాలను, నిర్జీవ మానవప్రతిమలను, సృజించుట కేర్పడిన విశ్వవిద్యాలయముల లోనుగాక "గట్టిమొట్టికాయలు పరాజయములు కల్పించు ప్రకృతి విశ్వవిద్యాలయములలో పట్టభద్రుడవు గమ్ము" "మనస్సునకు మనమంగీకరించిన లేక కల్పించుకొనిన హద్దులేతప్ప వేరుహద్దులులేవు" శరీరహృదయ దౌర్బల్యములు కలవారిని ప్రపంచ మాదరింప నేరదు. అన్ని శంకలుః గలవా రేమియు చేయజాలరు. "సంశయాత్ముల కీలోకములేదు. పరలోకములేదు. అతనికివినాశమే శరణ్యము" అని గీత చాటుచున్నది.

సామాన్యముగ నేమియు సాధించని వానికే విఘ్నములు కనుగొనుటలో తెలివితేటలు మెండు. అతడు తలపెట్టు ప్రతి కార్యము కష్టమయమే. అతని మార్గములోగల కష్టములే యతనికి ముందు కాన్పించును. వానినతడే స్వయాకర్షించును. అవియు పిల్చినవి తడవుగ వచ్చుచుండును. అట్టివారు కంటికి

"విఘ్నము లనే యుద్ధము" లనే పెట్టుకొందురు. వానితో చూచునప్పుడు వారికి త్రోవలో పెద్దపులులు, తోడేళ్ళు, సింహములు కన్పించును. వీరు నడ్డివంచి పనిచేయుట కిచ్ఛగింపరు. కడుపులో నీళ్ళు కదలకూడదు. ఒంటికి చెమట పట్టరాదు. కాలు కదలకూడదు. కాని వీరికి విజయము కావలెను. దానికి చెల్లింపవలసిన మూల్యము మాత్రము చెల్లింపరట!

"నీవిఘ్నములు నిన్ను బట్టియే యుండును. నీవు గొప్పవాడవైనచో నీవిఘ్నములు కొద్దివై పోవును. నీవుకొద్దివాడవైనచో నీవిఘ్నములు పెద్దవై పోవును." అని మూర్టెన్ వ్రాసెను. ప్రపంచ చరిత్ర చూచినచో విఘ్నములను ఛేదించు కొనుచు పైకి వచ్చిన వీరుల చరిత్రలే కన్పించుచున్నవి. అన్ని యవకాశములు, సర్వసంపదలు గల్గినవారు గర్విష్ఠులు మదాంధులునై లోకకంటకులైరి. గొల్లపల్లెలో జన్మించిన శ్రీకృష్ణుడు లోకోద్ధారుడయ్యెను. రాజవంశములో పుట్టిన కంసజరాసంధులు దురాగ్రహులైరి. ఐశ్వర్యవంతుల కుటుంబములలో పుట్టి, తప్ప త్రాగి యొడలెరుంగక నికృష్టజీవితములు గడపువారియొక్కయు, విదేశములలో వెలయాండ్ర గృహములలో మరణించు సంస్థానాధిపతులయొక్కయు గాథలను మనము వినుచు నేయున్నాము. ఇంతకు విఘ్నములనునవి కష్టములనునవి ఇంచుమించు బుద్ధి జాడ్యములు. లేనివానిని యున్నవనుకొని భావించుటచే గల్గు సనర్థములు. త్రాడును చూచి పామనుకొని భ్రమించి పాడలి చచ్చినవారు గలరు. నీడనుజూచి దయ్యమనుకొని, భూతమను

కొని బేజారై గుండెలు పగిలినవాండ్రున్నారు. దగ్గరగానుంచి నచో దమ్మిడీకాసు ప్రపంచమంతకు వెల్తురునిచ్చు సూర్యుని కప్పివేయుచున్నది. కష్టము లనువానికి సహజమైనయునికి కాని, బలముకాని వేరేలేదు. వానికి మనమిచ్చు బలమే బలము.' విజయబీజములు గలవానికి కష్టములు కాన్పించవు. ఆల్ప్సుపర్వతములు మహోన్నతములైనవి. అవి మంచుచే కప్పబడి మానవునకు దుస్తరములైనవి. నెపోలియన్ సేనానులు భయంకరములైన యా పర్వతములను చూచి దాటరానివని నిశ్చయించిరి. కాని నెపోలియనున కవి లేనట్లేయుండెను. అత డా పర్వతముల యవతలనున్న సస్యశ్యామల సీమలనే చూచెడి వాడు. ఆ పర్వతములకంటె తాను గొప్పవాడని యతడు భావించెను. ఆ భావనాపటిమచేతనే యతడు వాటి నవలీలగా తరించెనని మార్డెన్ వ్రాయుచున్నాడు.

ఉపాయమునకుమించిన యపాయములేదు. ఉపాయము లేని వాని నూరినుండి తరుమవలెనందురు. ఎన్నిసంకటములనైనను, ఎన్నికష్టములనైనను ఉపాయవంతు డవలీలగా సాధింపగలడు. అట్టివానికి కష్టములే సోపానములగును. శక్తికిమించిన కష్టము లేదు. 'అసాధ్యము' అనునది నానిఘంటువులోలేదు.' అని నెపోలియను చెప్పెడివాడు. అతడంతటితో నాగలేదు దాని నతడు తనహృదయమునుండిగూడ పీకివేసెను. 'అవకాశములు' లేవనుమాట దుర్బలులలక్షణము. సముద్రమును జేరుటకు నదులుపోవునట్లు ఉక్కుతునకవలె నచంచలుడగు వానిని,

నిశ్చలబుద్ధిగలవానిని యవకాశములు వాటంతటవియే వెన్నంటు చుండును.

యథార్థమునకు కష్టమనుకొనునది కష్టము కానేకాదు. కష్ట సుఖములను విడతీయుటకు వీలులేదు. కష్టములోనే సుఖము న్నది. సుఖములోనే కష్టమున్నది. అవి యవినాభావములు. ప్రసవవేదనలేనిది ప్రసవఫలము కల్గుటలేదు. ఫలముగల్గినపుడు కష్టమే సుఖముక్రింద పరిణమించుచున్నది. చేతికొద్ది పనిచేసి నపుడే వంటికిసుఖము, ఆరోగ్యము. కంటినిండ నిద్ర పట్టు చున్నది. శ్రమపడక సోమరిగ నుండువాని కివియేవియుగల్గుట లేదు. పగలెల్లకష్టపడి పనిచేయువాడు కటికినేలపై పరుండి నను హాయిగనిదురించుటయు, కాలుకదపక సోమరిగనుండు వారు హంసతూలికాతల్పములమీాదనైనను నిద్రరాక కొట్టు కొనుచుండుటయు, నేరోగముతోనో తీసికొనుచుండుటయు, మనము తరచుచూచుచుందుము. కష్టపడినవానికే పంచభూత ములును సేవచేయుచున్నవి. అన్నము, గాలి, నీరు కష్టపడిన వానికి రుచించునట్లు హాయిగొలుపునట్లు కష్టపడనివానికి కలుగజేయుటలేదు. కష్టమందే ఫలమున్నది. "కష్టములేని చోట గుణములేనేలేదు. అనుభవముద్వారా శక్తిచిహ్నములు ముద్రితము కానంతవరకు పందలు పిరులుగను, సత్యము విశ్వా సనుగను, చలామణి కావచ్చును."

కుస్తీ శరీరమునకు పాటవము నిచ్చునట్లు కష్టములు మనో బల బుద్ధిబలములను పెంచును. ఇవి పెరుగుట కింతకంటె వేరు

మార్గములేదు. "మనకుగల సౌకర్యములు, సహాయములుగాక మన మెదుర్కొనునట్టి విఘ్నములు, కష్టములు మాత్రమే మనలను పురుషులను చేయగలవను విషయము నెన్నిసారులు జపించినను తీరదు" "కష్టములు దైవముపంపు దూతల వంటివి. అవి మనకు సంభవించినప్పుడు భగవంతుని యొద్ద నుండి పంపబడిన యభివాదములనియు సతనికి మనపైగల విశ్వాసమునకు ఋజువులనియు మనము భావింపవలెను."

నీశక్తిసామర్థ్యములను, విశ్వాసములను, బలోత్సాహము లను, జీవితసంపత్తును బయటకు తెచ్చుటకు కష్టములకు మించిన మిత్రగణము వేరొకటిలేదు.

శరీరమును దాచుకొనువా డెవ్వడు గొప్పవాడయ్యెను? వత్తి తనశరీరమును దహింపజేయుట కిచ్చగించినపుడే తేజస్సు నిచ్చుచున్నది. అది లోభముచే తన్ను దాచుకొన జూచునేని దాని కాకాంతియే యుండనేరదు. గింజ నాశనమైనపుడే మొలక బయలుదేరుచున్నది. గింజ గింజగనే యుండినచో వృద్ధియేలేదు. రాత్రింబవళ్ళు కష్టించినవాడే తనకష్టము నైశ్వర్యముక్రింద మార్చివేయగలుచున్నాడు. ఈప్రపంచ ములో సమస్తము మారకము పద్ధతి మీదనే జరుగుచుండును.

మారకమునకు నీశరీర, బుద్ధిబలముల నీవెంతవరకు వెచ్చించు చుందువో, వానిని నీవెంతవరకు దాచుకొందువో, నీ కంత ఫలమే సమకూరును. కష్టమే శక్తిక్రింద, తేజస్సుక్రింద మారి పోవుచు మానవ పరమావధికి గొంపోవుచున్నది.

---

# పట్టుదల

శా॥ ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై.
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్.
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థములుజ్జగింపరుసుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

ధీరులు తమపట్టిన పట్టును వీడరని భర్తృహరి చెప్పుచున్నాడు.

మానవుడు సామాన్యముగ కొంత గర్విష్ఠి. అతనికి బుద్ధిమంతుడను గర్వముమెండు. ఎవరినైనను నిందించబూనినపుడతడు "పశువా!" 'బుద్ధిహీనుడా!' యని నిందించును. కాని నిజమున కతడీపశువులయొద్ద నేర్చుకొనవలసిన గుణములుకూడ చాల గలవు. అందులో పట్టుగల దొకటి. ఇది కొంతవరకు బలమునుండి, బింకమునుండి, యారోగ్యమునుండి, క్రమజీవితము నుండి చేకూరును. "భల్లూకపుపట్టు" యను మాట మనము తరచు వినుచుందుము. ఈపట్టులేని మానవుడు సాధించునది స్వల్పము. 'అబ్బే! దూడలనుకాయుటకొసే గంగన్న! క్లాసులో పదిమార్కులురాని లింగన్న! కాలేజీలో మూడుమార్లు తప్పేసిన రంగన్న ఎంతటి వాడైనాడు? ఇంతవాడౌనని నేను

కలలోకూడ ననుకొనలేదే' అను నాశ్చర్యవాచకములు విన లేదా! అన్ని తరగతులలో మొదటివాడుగనే యుండి కాలేజీ లలోను, యూనివర్సిటీలలోను, మెప్పులు బిరుదులు పొందిన యోధుడు జీవితరంగములోనికి వచ్చుసరి కుక్కిరి బిక్కిరియై పైనుదహరించిన గంగన్న, లింగన్నలతో నెంతమాత్రము సరి రాకపోవుట చూచుటలేదా?

ఎంత తెలివి యున్న నేమి? ఎన్ని శక్తులున్న నేమి? చేతిలో నెన్ని విద్యలున్న నేమి? బుద్ధియెక్కువైనకొలది యిది కాదని యది. యదికాదని యిది. ప్రతిదానిలో నేదోయొక దోషమునే చూచుచు మీనమేషములు లెక్కించుచు నష్టములనే గుణ కారించుచు, దేనిని నిశ్చయింపలేకపోవుట, యొక నిశ్చయము చేసికొని భల్లూకపు పట్టుతో దానిపారమును కనుగొన జాలక పోవుట —— ఈలోపుగా నొక తెలివితక్కువవాడు తనకున్న శక్తినే నమ్ముకొని పట్టినపట్టు విడువక యహోరాత్రములు దానినే మథించుచు, దానినుండియే యమృతమును, జీవిత సారమును, చిలుకుచుండుట మనము చూచుచుందుము. అతి తెలివి కుశ్శంకలకు దారితీయును. నిశ్చయమును చిందర వందర జేయును.

ఒకొక్కప్పుడుతనతరగతిలోను, ఇంటిదగ్గర తెలివితక్కువ వాడుగ పరిగణింపబడి యట్లుదెప్పబడయే మంచికి దారితీసినట్లు కాన్పించును. నైపు ఇట్టి మొద్దబ్బాయిలలో నొకడు. రవీం

మనకు విశ్వవిద్యాలయ పట్టములు లేవు. అక్బరుకు అక్షర ములే రావు. శివాజీకి డిగ్రీలులేవు. అయినను పై వారందరు తమకున్న శక్తులతోనే రాజ్యముల నేలగల్గిరి. దేనియందో యొక దానియందు పట్టుదలయే వీరికి భూషణమయ్యెను.

నెపోలియన్ కున్నంత తెలివితేటలు, మేధాసంపత్తు, వెల్లింగ్టన్‌కు లేవనియు, పట్టుదలలో నెపోలియను వెల్లింగ్టన్‌కు దీటురాకపోవుటచేతనే వెల్లింగ్టన్‌కు విజయము చేకూరినదనియు, పరాఙ్ముఖుడగుట యనునది యతడెరుగడనియు గార్డెన్ వ్రాయు చున్నాడు.

రాబర్టు బ్రూస్ సాలెపురుగు కథ మనమందరము చిన్న తనమున చదువుకొన్నదే! శత్రువులచే ననేకసారులు తరుమ గొట్టబడి నిరాశచే దుఃఖించుచున్న రాజు తన గమ్యస్థానము కేగుటకు ప్రయత్నించుచుండిన సాలెపురుగును చూచెను. అది యనేకసారులు క్రిందపడిపోయినను తనపట్టు వీడక కడపటి సారి జయించెను. దానిని జూచి రాబర్టు బ్రూస్ తెలివిదెచ్చు కొని తన తుదిప్రయత్నములో విజయవంతుడయ్యెను. క్షుద్ర జంతువులుకూడ మానవున కనేకపాఠములు చెప్పగలవు.

పట్టుదలకు మనోబలము పునాది. మనోబలము, దానితో సక్రమముగా జతకూడిన సంకల్పము యభేద్యమగు జంట యగును. పట్టుదలకు చాలిన దింకొకటిలేదు. దాని నలవరచుకొనినవారు పరాజయరహితు లగుదురు. వా రెన్ని సారు లోడింపబడినను

చివరకు విజయసోపానాగ్ర మధిరోహించి తీరుదురు. మానవుల నన్నివిధములైన విఘ్నపరంపరలద్వారా పరిశోధించు ధర్మము గల యంతరంగశక్తి యేదియో కలదనున ట్లొక్కొక్కప్పుడు ద్యోతక మగుచుండును. ఓడిపోయిన తర్వాత తిరిగి దమ్ము తీసికొని ప్రయత్నశీలురగువారే జయింతురు. ప్రకృతి యిట్టివారిని "భేషు, భేషు, మీరు దానిని సాధింతురని నేనెరుంగుదును" అని హెచ్చరించును. పట్టుదల యను పరీక్షలో నుత్తీర్ణులు కానివారి నెవరిని ఈయంతర్నిహితశక్తి గొప్ప విజయము ననుభవింపనీయదు. "ఈ పరీక్షను స్వీకరింపనివారు మైలురాయివలె నున్నచోటనే యుందురు" అని యొక పాశ్చాత్యకవి వ్రాసెను. ఓటమికి సిద్ధము కానివారికి విజయమును చేకూరనేరదు.

పట్టుదలలేని మనుష్యులు గాలికి కొట్టుకొనిపోవు తేలిక వస్తువులవలె స్వల్పకారణములచే తాము చేపట్టిన పనిని విడిచి వేయుచుందురు. తేలికవస్తువులు నీటిమీద తెప్పున తేలుచున్నవి. బరువైనవస్తువులు, విలువైన వస్తువులు నడుగునకు ననగా తమ గమ్యస్థానమునకు చేరుచున్నవి. అట్లే యీ జీవిత ప్రవాహములో నేపట్టుదల లేనివారైనో యొకగాలికి లేక ప్రతిగాలికి కొట్టుకొనిపోవుచుందురు.

పట్టుదల నిశ్చయము నుండియు, నిశ్చయము విశ్వాసము నుండియు జనించుచున్నవి. ఏదో యొక విశ్వాసము, ఆత్మ విశ్వాసము దైవవిశ్వాసము, ఇరుగుపొరుగుయందు విశ్వాసము

తనపని న్యాయమైన దను విశ్వాసము, తానవలంబించిన మార్గము నిర్దుష్టమైన దను విశ్వాసము దానికొరకెట్టి త్యాగమునైనను చేయు సంసిద్ధత మున్నగు శుభగుణములు, పురుష లక్షణములు గలవానికే పట్టుదలయుండును. విశ్వాసహీనుని బ్రతుకు నిరర్థకము. బుద్ధిలేదనుకొను పశువులపట్లగూడ లోకములో విశ్వాసమున్న కుక్క, గుఱ్ఱము మొదలగు జంతువుల కున్న గౌరవము, విశ్వాసము లేని పిల్లి మొదలైన జంతువులకులేదు. ఎవనిని విశ్వసింపని వాని నితరులు మాత్ర మెట్లు విశ్వసింతురు ?

కనుక విశ్వాసముతో కూడిన పట్టుదలగలవారు పట్టినది ఫలించియే తీరును. పట్టుదల యెచ్చటలేని శక్తిని ప్రసాదించును. అది మానవశక్తులన్నింటిని క్రోడీకరించుకొనును. "పట్టుదల రాజకీయవేత్త బుద్ధి, యోధుని ఖడ్గము పరిశోధకుల రహస్యము. పండితుని ప్రతిభ" అది సాధింపని దేదియులేదు. తన తండ్రియొక్క గాడిదలకొరకు పట్టుదలతో వెతుకుచుండగా "సాల్" అనువాని కొక రాజ్యము లభించెనని" గేకీ కవి చెప్పుచున్నాడు. హిందూదేశ పశ్చిమ మార్గమును వెదకుచుండగా కొలంబసు అమెరికా దేశమును కనుగొనెను. పట్టుదలలేని కుందేలు ఎంతవడిగలదైనను పట్టుదలగల కూర్మముచే నోడింపబడెను. ఆంగ్లేయుల పట్టుదల ప్రసిద్ధిగాంచెను. కనుకనే సముద్రము మధ్యనున్న యీచిన్నదీవి "రవి యస్తమింపని" సామ్రాజ్యము స్థాపించెనందురు.

ప్రపంచమందంతట పట్టుదలగల మధ్యరకపు మానవులు సాధించినవే గణనకెక్కినవి. అట్టివాడు తాను గెల్చుచున్నది లేనిది చూడవలెనని యెన్నడు నాగిపోడు. అతడు చరచర ముందుకు సాగిపోవును. నదులు, పర్వతములు, మిట్ట పల్లములు రొంపులు, ఊబులు — మొదలగునవి యతనిమార్గమున తగులుచునే యుండును. అతడు వీనిని లక్ష్యముచేయడు. కుక్కలు మొరుగుచుండ నేనుగు సాగిపోవుచుండున ట్లితడు విఘ్నములను గుర్తింపడు. ఏకైక లక్ష్యముగల సామాన్యబుద్ధితో ననేకతెన్నుల కీడ్చు తీవ్రబుద్ధి తులతూగనేరదు.

పాఠశాలలోను, కాలేజీలలోను, చదువక మంచి పట్టుదల గల్గి చివర కేగురువు లేకుండగనే స్వయంకృషిచేసి పైకి వచ్చిన గ్రామవాసులను చూడుడు. వారిలో కొన్ని తళుకుబెళుకులు లేకపోయిన లేకపోవచ్చు, జిలుగు పలుకులు లేకపోవచ్చు. వీనికిమించిన స్వతంత్రాలోచన చొరవ, వేగము మొదలగునవి వారిలో కాననగును.

వారి శక్తియంతయు కృత్రిమ విద్యాగార చక్రములో పడి నలిగి పోక మంచి బింకము గల్గి యెట్టిక్లిష్ట జీవిత సమస్యలనైన నెదుర్కొన సమర్థమైయుండును. రవీంద్రుడు, దయానంద, రమణ మహర్షి మొదలగువా రెందరో గలరు. వీరు గంటలకొలది శుష్కోపన్యాసము లీయనక్కరలేదు. చిక్కిరి బిక్కిరి వాదముల విరజిమ్మ నక్కరలేదు.

మహాత్మునకు విశ్వవిద్యాలయములో సంబంధ సంపర్కము లున్నను సతని మహత్తుకు స్వయం కృషి, ఆత్మవిశ్వాసము, పట్టుదల కారణములుగాని, విశ్వవిద్యాలయపు గాలి కాదని వేరుగ చెప్పనక్కరలేదు. ఈవిద్యాలయములలో మహాత్ముని పట్టము కంటె గొప్పపట్టములు పొందినవా రెందరో గలరు. తళుకులను చూపగలవారును గలరు. ఆ తళుకులతోను, వా రూరేగ వలసినదే తప్ప విశ్వమను సీవిద్యాలయములో, మానవధర్మ నిర్ణాయకములో, తన్నిమిత్తమైనపోరాటములలో జగత్కల్యాణ సమస్యలలో వారు అ. ఆ. లు ప్రారంభింప వల సినవారే. విశ్వాసముతో కూడుకొన్న పట్టుదల మూగ వానిని మాట్లాడించును. కుంటివానిని శిఖరాగ్రముల కెక్కిం చును. కోరిన సమస్తములను చేకూర్చును.

కం॥ కందుకమువోలె సుజనుడు
క్రిందంబడి మగుడ మీదికి న్నెగయుజుమీ
మందుడు మృత్పిండమువలె
క్రిందంబడి యడగి యుండు గృపణత్వమునన్,

పట్టుదలగలవా డోటమి నంగీకరింపడు. ఓటమి నంగీకరిం పని వానికదియే సోపానమగును. ఎన్నిపోయినను పట్టుదల మిగిలినచో దానినుండి పోయిన వన్నియు తిరిగి సాధింప బడు చున్నవి. "తనప్రయత్నములలో ప్రతిభ విఫలత నొంద

వచ్చును. దక్షత దుస్సాధ్యమని చాటవచ్చును. ప్రతియితర గుణము లాభములేదని నిస్పృహ చెందవచ్చును. నిపుణత, చాతుర్యము, విరమించుకొనవచ్చును. రాజనీతి పలాయనము చెందవచ్చును. తర్కము, వాదము, పలుకుబడి యన్నివిధముల "త్రోపుడులు" చేయగల్గినంత జేసి విరమింప వచ్చును. ఇవన్నియు నిష్ఫలములైన చోట పట్టుదల జాతికుక్కల కుండు పట్టుదలవంటి పట్టుదల యందే వేసిన చేయివలె పని చేయును. అది విడువక సాగదీసినకొలది సాగుచు జయించును. అసాధ్యమును సుసాధ్యముచేయును. ఆహా! ఒక ప్రయోజనముపట్లగల పట్టుదల యెన్ని యద్భుతములను సాధించెను' ఇతర శక్తులన్నియు లొంగిపోయి రంగమును వీడి పారిపోయి నపుడిది వెనుదిరుగక నిలిచి పోరాడును. ఆశరంగమును వీడి పారిపోయినతర్వాత కూడ నిది యనేక సమరముల జయించెను." ఇట్టి పట్టుదలగలవారి గాథయే చరిత్ర యగుచున్నది. తక్కుంగలవా రందరు ప్రపంచముచే విస్మరింపబడుచున్నారు.

# శక్తి



"మానవులలో మహామహులకు, సామాన్యులకు, విఖ్యాత పురుషులకు, నూరు పేరు లేనివారలకు భేదమెచ్చట గలదు?

శక్తి - అభేద్యమైన నిశ్చయము. ఒక ప్రయోజనమును స్థిరపరచుకొనుట చావో లేక విజయమో చూరగొనుట. ఈ గుణము దేనిని సాధింపనేరదు?" యని యొక కవి ప్రశ్నించుచున్నాడు. పైవారిలో నొక తెగవారు శక్తివంతులు. రెండవ తెగవారు శక్తిహీనులు, నిర్వీర్యులు, వ్యర్థులు.

శక్తి, వీర్యము, కార్యదక్షత, చొరవ యమోఘమైనది. దానిముందు విఘ్నములు, సంశయములు, సంకటములు పలాయనమగును. పర్వతావతరణముచేయు గంగాప్రవాహ శక్తి ముందు చెట్లు, పుట్టలు, రాళ్ళు, శిథిలమగుచు కొట్టుకొని పోవుచున్నవి. మానవశక్తిగూడ యొక ప్రవాహము వంటిదే! ఈశక్తి లేకపోవుటచేతనే చాలమంది విఫలు లగుచున్నారు. ఇతర పరికరము లెన్నియున్నను ఉండవచ్చును. ప్రాభవము, యోగ్యత, తెలివితేటలు, మర్యాద, వినయము - ఇత్యాదులున్నను శక్తిలేనిచో ననగా దక్షత, కార్యశూరత్వము, విఘ్నములను తృణీకరించి ముందుకురుకు రయములేనివాడు

సాధించున దత్యల్పము. ఎక్కువగా చదివినవారికి యనేక భాషలలోను, శాస్త్రములలోను, నభినివేశము కల్గియు శక్తి లేక స్తబ్ధులైనవారిని యనేకులను చూచుచుందుము. ఆచరణ రూపమును వహించని తెలివి యెంతయున్ననేమి ? శక్తిలేని కాగితపు తీర్మానము లెన్నియున్న ఫలితమేమి ? అనేకమైన నేమి ? సాహసము, యుత్సాహము, పౌరుషము - వీనితో పాటు అంతఃకరణశుద్ధి, సత్యసంధత, యున్నచో సమకూరని దేదికలదు ?

కార్యముచేసి చూపగలవానిని చూపింపుడు. చొరవగల వానిని, రక్తములో శూరత్వము, ధీరత్వము గలవానిని చూపింపుడు. అను హెచ్చరిక మనము తెలుచు వినుచుందుము. శక్తియున్నచో ఇతర పరికరములు తక్కువగ యున్నను రాణించును. గుండు ఎంత పెద్దదైనను మందులేనిచో నేమి ప్రయోజనము ? ఎక్కువ వేగముగల తుపాకినుండి విడువబడిన చిన్న క్రొవ్వొత్తి ఎంతదట్టమైన యట్టనైనను ఛేదించుకొని పోవు నని మార్డెన్ నుడివెను.

వీర్యమే శక్తి. కనుక వీర్యము సదా రక్షణీయము. జీవిత భానుని మొదటి పాతికసంవత్సరముల యుషఃకాలము నెవ్వ డత్యున్నతస్థాయిలో నడుపగలడో యతడు ధన్యజీవి. అట్టి వాని సంకల్పములకు, నిశ్చయములకు, కార్యకలాపములకు, నడ్డమునచ్చున వేమియు నుండవు. వచ్చినను ఆగవు. చిన్నతన

మున తెలిసియో తెలియకో వీర్యభ్రష్టము గావించుకొనిన వాడు శ్రేష్ఠకార్యములను చేయజాలడు. వానికొక పట్టుదల, స్థిరత్వము, ధారణాశక్తి, తేజము, పనులలో రయము నుండ నేరవు. జీవితములోని తొలియాశ్రమమైన బ్రహ్మచర్యమున కెక్కువ ప్రాధాన్యము వచ్చుట కిదియే కారణము. వీర్యమే సమస్తమునని గ్రహింపబడెను. వీర్యమే మనఃపాటవమగుచున్నది.

నేటి తల్లిదండ్రులు, విద్యావిధానము దీనిని గుర్తించినట్లు లేదు. పిల్లవాని నే పాఠశాలకో, కళాశాలకో పంపినంత మాత్ర మున నే తమధర్మము నెరవేరినట్లు తల్లిదండ్రులు మురియు చున్నారు. తరగతులప్రకారము, పాఠ్యక్రమము ప్రకారము గంటలప్రకారము, తమపనిని జరిపి ధన్యులైన ట్లుపాధ్యా యులు భావించుచున్నారు. ఇంతకుమినహా రెొకరి సంపర్క మింకొకరికి లేదు. ఒకరి సహవాస మింకొకరికిలేదు. ఒకరి జీవిత రహస్య మింకొకరికి తెలియదు. జీవితముతో సంబంధములేని యిట్టి చదువు పూర్తియై యేండ్లు వచ్చుకొలది బాలుని యుత్సాహము, యౌవనము, వీర్యము, యుపజ్ఞ, స్వతంత్రశక్తి వృద్ధిజెందుటకు బదులు పూర్తిగా నశించుచున్నవి. చివరకు స్వతంత్రముగా ప్రపంచము నెదుర్కొనగల శక్తిసామర్థ్యములు లేని మానవాకారములు మాత్రము మిగులుచున్నవి. దీనివలన జాతికి గల్గుచున్న యనర్థ మింతింత యని చెప్పరాదు. కాలేజి గుమ్మము దాటి బయటికివచ్చి చేయునదేదియు తోచక కాలు చేతు లాడక జీవనోపాధి దొరకక పొట్ట చేతబుచ్చుకొని

యూహూరు తిరిగి హతాశులై యప్పుడప్పు డాత్మహత్యకూడ గావించుకొనుట చూచుచున్నారము. ప్రపంచము శక్తివంతులనే యారాధించును, మెచ్చుకొనును. వారికే తన యైశ్వర్యమును కురిపించును. నేడు శక్తిగల జాతులే ప్రపంచము నేలుచున్నవి. శక్తిహీనులు, దుర్బలులు యధోగతి పాలవుచున్నారు. శక్తి చూపించని పొడిమాటలవలన లాభములేదు. "తమకుదాము సాయపడువారికే దేవుడును సాయపడును" ఇంజను యెంతసరిక్రొత్తదైననేమి? ఎంతగొప్పదైననేమి? దానిని నడిపించు శక్తిలోనే కీలకమంతయు కలదు. ఆవిరిశక్తిలేని యంత్రము వీర్యశక్తిలేని మానవుడు నలంకారవిద్యార్థులు. వీర్యము రెండువిధములు. ఒకటిశారీరకము, రెండు మానసికము. సరిగా సురక్షితమైనచో మొదటిది రెండవదిగా మారును. రెండవదానికి మొదటిదే పునాది. ఈ రెండును యుపాస్యములే. శారీరము కేవలము తల్లిదండ్రుల దేహారోగ్యములపై నాధారపడియుండును. కనుక బిడ్డలవీర్యపరిమాణమునకు చాల వరకు తల్లిదండ్రులే కారకులగుచున్నారు. వారికి బిడ్డలుసంపాదించియిచ్చి ధన్యులుకావలె ననువెర్రులకంటె లోకమునకు వీర్యవంతులను ప్రసాదించువారేధన్యులు. శివాజీని, రాణా ప్రతాపుని, లక్ష్మిబాయిని, మహాత్ముని కన్నతల్లిదండ్రులు ధన్యులా? కాకులనుకొట్టి గద్దలకువేయుజూచు లుబ్ధులు ధన్యులా? మీరిచ్చుధనరాసులు మీరిమొనటనే యీబిడ్డలచే ధ్వంసము గావింపబడుట మీరుచూచుటలేదా?

బాల్యమున బిడ్డల వీర్యరక్షణమును, గుణావగుణముల సోపానమునకు కాలవరకు తల్లిదండ్రులే బాధ్యులు. జ్ఞానము వచ్చువరకు వారిని కాపాడవలసినబాధ్యత వారిదే. నిర్దుష్టగా అభివృద్ధి గాంచింపబడిన శరీరస్థైర్యము సుఖమును ఆరోగ్యమును, ఉత్సాహమును, తేజస్సును ప్రసాదించును. శారీరక స్వాస్థ్యమే మానసిక స్వాస్థ్యము.

ఈమనశ్శక్తికంతులేదు. పిండికొలదిరొట్టె. సాధనకొలది, యత్నముకొలది, యమనియమాదులకొలది యిదిపెరుగు చుండును. దీని పెరుగుదలయే మనపరమావధి, జీవితగమ్యము. మనస్సుపెరుగనిది మానవుడుపెరుగడు.

శరీర మానసికశక్తులుడిగి విఫలమనోరథులై పడిపోయిన కోట్లకొలది మానవకంకాళములపై జీవితపథము సాగిపోవు చున్నదని మనము గుర్తింపవలెను. దుర్బలత్వము, స్తబ్ధత్వము, కదలికలేకపోవుట, మృత్యుసమానములు. చొరవ, సాహసము, పౌరుషములేనివారు విఘ్నముల నెదుర్కొనజాలరు. వానినెదుర్కొని తరించుశక్తి, బుద్ధిబలము, పటుత్వము, వారిశరీరము దియొక్కపాళ్ళలో లోపించిపోయెను. ఇగిరిపోయెను. రక్తము నిర్వీర్యమయ్యెను. సాధనాబలము సన్నగిల్లెను.

ప్రకృతి మనకనేక సంభారములు సమకూర్చి యుంచినను వానినిమనమే పోగొట్టుకొనుచున్నాము. సుఖము, విజయము

తుష్టి, పుష్టి శీలసంపదనిచ్చు సమస్తద్రవ్యములు మనలోనే యున్నవి. ఈరోజులలో సమస్తము నార్థికదృష్టితో చూచు మనము నిజజీవితమును పోగొట్టుకొనుచున్నాము. ధనమే సర్వస్వమై, శరీర, ప్రాణ, వీర్యశక్తులను చిమ్మివేయువిషయమై ఎట్టిశ్రద్ధతీసి కొనబడుటలేదు. అమూల్యములగు నీజీవితశక్తులను డబ్బు కక్కుర్తికొరకు జారవిడుచువారి నేమనవలయునో తెలియ కున్నది. ఏతండ్రియో తాతయో సంపాదించిన వేలకొలదిధనము కొద్దిరాత్రుల భోగములో తగులబెట్టినవారినిచూచి దుఃఖింతుము. జాలిజెందుదుము. కోపింతుము. కాని యీపాప మంతటితో ముగియుటలేదు. ఇచ్చట ధనమొక్కటియే వెచ్చింపబడుటలేదు. పోయినసొత్తు తిరిగి సంపాదింపవచ్చును. కాని యీవ్యభిచారములో వెచ్చింపబడిన శారీర మానసిక శక్తులు సంపాదింప నేరితరము? ఏదీ! కోటిరూప్యములు వెచ్చించి యొకజీవశక్తిని సృష్టించుము? అదిదుస్సాధ్యము. శీలము చెడుటవలన జీవితములో మిగిలినదంతయు నష్టమై భ్రష్టమై దాని పునాదులే కూలుచున్నవి. జీవితరసమంతయు నింకిపోవుచున్నది. వీర్యనష్టమేమృతి. వీర్యహీనునకు తోలుబొమ్మకు భేదమేమి?

భారతమా! "కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేల ఏడ్చెదో..." పోయిన కోహినూరు వజ్రముకొరకై నీవు దుఃఖించుటలేదు. అట్టివి నీగర్భములో నెన్నియో కలవు.

మయూరసింహాసనస్థగిత రత్నములకొరకు నీవు పరితపించుట లేదు. అవి నీ నిత్యవంట. కొండువందల యేండ్లనుండి యథేచ్ఛగా తరలింపబడిన ధనరాసులకై నీవు దుఃఖించుటలేదు. ఈ పుణ్యభూమిలో, నీ కర్మభూమిలో, నీ జ్ఞానభూమిలో, నీ యనమానసీమలో, నీకడుపున మందులు, స్తబ్ధులు, తేజో హీనులు, వీర్యహంతకులు, మానవభ్రుపులు నేలపుట్టిరో యను దుఃఖమాపుకొన జాలకున్నావు. పాపము శమించుగాక!

ఈవతన వేగ మాగినది. నీ స్మృతి కన్గినది. ఐశ్వర్యమహిమ తెలిసినది. మహాత్ముడు నీ దుఃఖము నపనయింపబూనినాడు. విజయభేరి మ్రోగించినాడు. నీ ప్రజ యిప్పుడు జీవచ్ఛవములవలె నుండుట కిచ్ఛగించుటలేదు. ఈ గడ్డలో చైతన్యాంకురము లుద్భవించినవి. మాంద్యము మాయమగుచున్నది. నీ దేశమున ముక్కోటిదేవత లుండెడివారని సాంప్రదాయము కలదు. ఇప్పు డా సంఖ్య దశగుణము కానున్నదని నిన్నారడించెదము తల్లీ !

విజయమునకు వీర్యశక్తికి నడ్డమువచ్చు ఆటంకములను గూర్చి మార్డెన్ యిట్లు వచించినాడు. "తన విఫలతను దురదృష్టమును సాధకబాధకములను గత ప్రమాదములను తప్పులను గూర్చి విలపించు నపుడెల్ల ప్రతివాడు తన జీవశక్తిని కొంత పోగొట్టుకొను చున్నాడు. విజయుడవు కాదలచినచో గతమును భస్మము చేయుము. భూతపరాఙ్ముఖుడవు కమ్ము

గత నీహారములను వెనుకకునెట్టి జ్యోతిర్ముఖుడవుకమ్ము. లోక
మెరిగినను ఎరుగకున్నను ప్రతిద్రోహకార్యము నీ జీవశక్తి
నికృంతనమే. ప్రతి యపవిత్రకార్యము, భావము లేక కోరిక
విజయమును గుణమును నాశనము చేయును.

జీవితములో నసౌఖ్యమును అసామరస్యమును దెచ్చు సమ
స్తము చిందులు గంతులు రంపాలు వేయించునవియన్నియు ప్రాణ
శక్తిని తీయునవియే యని గుర్తింపుము. నీ నాడీమండలమును
కుతలపరచు సమస్తము శక్తిసంహారక విషయమే. స్పర్ధ
విజయమునకు ఆనందమునకు పరమశత్రువు. అది యెట్టి శుభ
మును నెట్టి విలువను సంపాదింపక పోగా జీవిత యంత్రాధార
ముల నరగజేయును. జీవితములో నెట్టి కిరకిరలు, గర గరలు
లేకుండ జేసికొని నీశక్తుల నుద్దీపింప జేయుట, శక్తులను చిందర
వందర జేయు రంధ్రముల నాపవేయుట—ఇదియే నీ ప్రథమ
కర్తవ్యము?

ఈరోజులలో నెచ్చట చూచినను బింకముచెడి యొంటి
పలుకు పలుకుచు వసిలిపోయిన మానవయంత్రములనే చూచు
చున్నాము. అతిసున్నితములైన యీ యంత్రాధారము లరిగి
పోవుట వలన గరగరలు, చమురు యిగిరిపోవుట వలన కిరకిరలు
నాడులన్నియు నుడుకెత్తిపోయి యానిరిని (శక్తిని, కాపాడు
సంధులలోని చిల్లులమూలమున చిటపటలు లే వినసగుచున్నవి.
సుకుమారమై, ప్రాణవంతమై, స్పందశక్తిగల యీ యంత్రము,

విచారములచే నలిగిపోయిన యాధారము గల్గి చీదర, చికాకు, మనః క్లేశము అను దుమ్ముతో నిండియుండును. ఆవిరి యుత్పన్న మగు కాగులో నజాగ్రత, యథేచ్ఛావిహారము లను రంధ్ర ములద్వారా శక్తి కణములు గట్టుకొని యెగిరిపోవుచుండుట యే ప్రతి చోట చూతుము. అధమపక్ష మొక శతాబ్దమైనను మన్నున ట్లత్యద్భుతముగా నిర్మింపబడి యర్పించబడిన యీ యసమాన మానవయంత్రము సగముజీవితమైనను కాకమునుపే పెంటమీాది కీడ్చి వేయబడుచున్నది. నెలలో నొక్క సెకండులో నొకయంశమైనను తేడా రాకుండునట్లు తన గడియారము నతి శ్రద్ధతో తుడుచుచు వేళప్రకారము "కీ" యిచ్చుచు నూరు కండ్లతో నీ మానవుడు చూచుచున్నాడు. కాని యమూల్య మైన తనజీవ యంత్రమును తానెన్నడు, నెవ్విధమునను, బదులు సృష్టింపలేని యంత్రము నితడు దుర్వినియోగము చేయుచు న్నాడు. చివరి కితడు తన గడియారమునకు తడిగాలులు సంప ర్కము కల్గనీయడు. దైనమో సమీాపమునకు తీసికొనిపోడు గాని తనజీవ యంత్రమునుమాత్ర మన్నివిధముల భ్రష్టమొన ర్చును. అసూయ, కోపము, ద్వేషము, యథేచ్ఛావిహారము- మొదలగు నమానుషకర్మలచే నతడు దీనిని నులుముచు, త్రుం చుచు, మెలిపెట్టుచు, ననేక కష్టనిష్ఠురములపాలు చేయుచు, ఓపపలుకు పలుకువరకు విడచుటలేదు. ఇట్లతడు తనప్రయో జనములో, తనపనిలో, పదవనంతైనను సాధింపక మునుపే వసిలిపోయి వశముతప్పి జర్జరితాంగుడైన యొకప్రాత డొక్కుగ

తయారగుచున్నాడు. "జీవితమున శోకనాశనము, అర్థము యున్నచో నది శక్తినాశ యని భావింపనగును." పదార్థశాస్త్రములో శక్తి పదార్థముకూడ నాశరహితములని చెప్పబడు చున్నది. కనుక నిశ్చయముగా నీజీవితము నాశనమొందజాలదు. శక్తియొక్క యితరరూపాంతరములవలె జీవితముకూడ మార్పు, వివిధ యవస్థాభేదము పొందునేగాని సుతరాము నశింపజాలదు. చావు కేవలమొక యవస్థ—ఒకమార్పు—అది యతి తాత్కాలికావస్థ" యని యొక పాశ్చాత్యవేత్త వ్రాసెను. గీతయు దీనినే చాటుచున్నది.

కనుక శక్తియున్నచోటనే విజయము చేకూరుచున్నది. మానవుడు తన నిజశక్తులను వృద్ధిపరచవలెనే గాని వ్యర్థము చేయరాదు. యుక్తముగా నారాధింపబడిన మానవశక్తి నెదుర్కొను శక్తియు వేరొండు కానరాదు. సౌఖ్యము, శాంతి, నైశ్వర్యము, శక్తివంతుల నన్వేషించును, గాని పిరికి పందలను, సద్ధులను, క్రియాహీనులను, సోమరులను వరింప జాలవు. శక్తివంతులకు ప్రకృతి కామధేనువగును.

శా॥ ఉత్సాహప్రభు మంత్రశక్తియుతమేయుద్యోగ మాగాధసం
విత్సంపన్నుడవై తివే చదివితే వేదంబులున్ శాస్త్రముల్.